సర్వ సామ్యములు రచయిత్రివి

మూల్యము రు 22-00

ప్రాప్తి స్థానము:

**అంగర రాధాదేవి**

1-9-20, అబ్బురాజువారి వీధి,

నాజరుపేట

**తెనాలి-522 201.**

ప్రథమ ముద్రణ

**ఫిబ్రవరి 2000.**

ప్రతులు : 1000

ముద్రణ:

**అశోకా ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి.**

# విషయ సంగ్రహం

పరమేశ్వరుడు ఒకడే. అయితే ధర్మ సంరక్షణార్థం ఈ భూమి మీద అనేక రూపాలలో అవతరించాడు. రాముడు, కృష్ణుడు, నారాయణుడు, ఈశ్వరుడు, వెంకటేశ్వరస్వామి, ఆంజనేయస్వామి, మనకి ఆరాధ్య దైవాలు అలాగే లక్ష్మీ, పార్వతి, దుర్గ, రాజరాజేశ్వరి, మొదలైన దేవతల్ని మనం నిత్యం పూజిస్తాం మానవుడుగా జన్మించడం మనం చేసుకొన్న పుణ్యం మానవ జన్మ దుర్లభం ఇలాంటి అరుదైన మానవ జన్మని సద్వినియోగ పరచి మోక్ష సాధనలో నిమగ్నులవటం మానవుల కర్తవ్యం కోరికలు గుఱ్ఱాల వంటివి ఇంద్రియాలు ఇహసుఖాల వెంట పరుగులెత్తుతాయి. వీటిని నిరోధించి మనసుని పరమాత్మలో లగ్నం చేయాలని మహాత్ముల ప్రభోధం ఇందుకు ఒకే ఒక్క సులభ సాధనం భక్తి మనం ఆర్తితో పిలవాలేగాని దేవుడు ఓయని పలుకుతాడు. భక్తి మనసుని పరవశింప చేస్తుంది దైవ సామీప్యాన్ని సాధిస్తుంది భక్తితో ఏదేవుణ్ణి కొలచిన, ఏ దేవతని తలచినా మనసు ఊర్రుతలూగిపోతుంది వివిధ సందర్భాలలో, భక్తి మాధుర్యాన్ని గ్రోలుచూ, భక్తి పారవశ్యాన్ని పొందుతూ తాదాత్మ్య స్థితిలో ఉన్నప్పుడు నా హృదయంలో వివిధ దైవాలని గురించి అప్రయత్నంగా జాలువారినవే ఈ భక్తి గీతాలు ఈ గీతాలలో మామూలు మాటలలోనే నా హృదయాన్ని వివిధ దైవాలకి వినమ్రంగా నివేదించుకున్నాను. ఇవి అందరూ పాడుకోటానికి యోగ్యమైనవైతే నాకంతకంటే కావలసినది ఏమిలేదు ఈ భక్తి గీతాల ప్రచురణకు ఆర్థిక సహాయం చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నేను సర్వదా కృతజ్ఞురాలిని

**అంగర రాధాదేవి.**

రచయిత్రి

# భక్తీ గీతములు

## భజనలు

---

### పాట:1

పల్లవి గజనానా ఓ గజాననా
మూషిక వాహన - గజాననా
ముల్లోక పూజిత - గజాననా
ముందు పూజనీకయ్య - గజాననా ||గ||

చరణం 1 ముక్కంటి తనయా - గజననా
మోదక ప్రియ - గజాననా
ఏక దంతా - గజననా
లంబోదరా - గజాననా ||గ||

చరణం 2 గణములనాయక - గజాననా
విఘ్ననాశకా - గజాననా
గరిక పూజితా - గజాననా
గైకొనుమా పూజ - గజాననా ||గ||

చరణం 3 హరతి అందుము - గజాననా
పార్వతి నందన - గజాననా
మాపూజ లందుము - గజాననా
ఈ రాధ పిలిచేను - గజాననా ||గ||

## పాట:2 (పాడనా తెలుగు పాట వరుస)

పల్లవి పాడనా నీదు నామం పరవశమై
నే పరవశమై పరమాత్మ నీ నామం ॥పా॥

చరణం 1 కోవెల గంటల గణగణలో
గోవింద నామపు ఘోషలతో
మలుపులూ తిరిగే కొండలపైనా
మనలే కొండల దారుల లోన
భక్తజనుల సందోహంతో నిండియుండు నీదు శిఖరం ॥పా॥

చరణం 2 అక్రూర ప్రహ్లాద రామరాదాసులూ ॥అ॥
తనువు మరచి భజియించిన నామం
మానవ జన్మ తరియించేదీ
భక్తుల నోట వినిపించేదీ
తీయని చక్కని నామం - నీలపు వర్ణపు రూపం పరమాత్మ ॥పా॥

చరణం 3 వళ్ళంత వజ్రంపు కవచం ॥వ॥
శిరమున రత్న కిరీటం
మోమున కోటి సూర్యుల కాంతి
మెరిసే చక్కని రూపం
అభయ హస్తము చూపే దైవం
పిలచిన పలికే శ్రీహరి నామం
తియ్యనైన నీదు నామం అమృతాన్ని మించిన నామం ॥పా॥

చరణం 4 అందాలు చిందించు శిఖరం
కనువిందు చేసేటి రూపం ॥అం॥

శాంతికి నిలయం నీ ఆలయమూ
ఇహమును మరిచే నామం
హరిహరి అని నిను భజనలు చేయ
భవ బంధములను బాపే నామం
తీయనైన నీదు నామం
అమృతాన్ని మించిన నామం ॥పా॥

చరణం 5 ఆకాశగంగలో స్నానం - హరియించు ఏనాటి పాపం ॥ఆ॥
కనక కిరీటా కాంచన చేలా
కామిత దాయక రావా
మంగానాధా - మంగళదాతా
మాయిలవేల్పుగ నిలిచే వయ్యా ॥పా॥

చరణం 6 మరుజన్మ మాకింక లేని
వరమీయ వేడేను స్వామీ ॥మ॥
మోహన రూపా మాధవదేవా
అక్ష్మినాధా రావా
పావన చరితా పాపనాశకా
పాద దాసిని కావగ రావా ॥పా॥

## పాట:3

పల్లవి ఎంత మధురము నీ నామం
ఎంత మోహనము నీ రూపం
ఎంత చూచినా తనివి తీరదు
ఎంత భజించిన కాలము చాలదు ॥ఎం॥

చరణం 1 ఏడుకొండలా వెంకటేశ్వరా
ఎన్నాళ్ళు వేచేను నిన్ను చూడ నేను
అలసినదయ్యా నా కనుదోయీ
అగుపించవయా అలివేలు నాథా ॥ఏ

చరణం 2 ఏడు కొండలా వెంకటరమణా
సన్నుతింతురా - సంకట హరణా
విడువలేనురా - నీ పదయుగళి
దరిశన మీయరా - నీదరి చేర్చరా ॥ఏ

చరణం 3 ఏజన్మ కర్మో ఈ జన్మలో నేను
ఇడుములలో పడి వేసారుచుంటి
వేడు చుంటిరా - వెంకటరమణా
వేగమె రావా - నా వ్యధ బాప ॥ఏ

చరణం 4 నిను చూడలేనా - ఈ జన్మలోనా
తిరుమలవాసా ఓ శ్రీనివాసా
వడ్డికాసులూ నే నివ్వలేనయా
పద దాసి పిలచేనూ కనిపించ రావయ్యా ॥ఏ

## పాట:4 (చక్కనయ్యా చందమామా వరు

పల్లవి నల్లనయ్యా శ్రీనివాసా
పలుక వేలయ్యా నిన్ను నమ్మి
కొలచినానూ - కావరావయ్యా ॥న

చరణం 1 నీదు స్మరణే చేసితి మది నిన్ను చూడా వేడితీ ॥నీ
పద్మానాథా బ్రోవరావా కోపమేలయ్యా
పలుక వేలయ్యా ॥న

చరణం 2 కలియుగా వైకుంఠ మనుచూ
ప్రజలు నిన్ను చేరెదరు
కన్నులారా కరువు తీరా
కానరావయ్యా గరుడ వాహనుడా ॥న॥

చరణం 3 స్వర్ణశిఖరమూ నీ నిలయం
నీదు హృదయమె నవనీతం
నాదు చింతలు బాప వేగ
కదల వేలయ్యా అలుక ఏలయ్యా ॥న॥

చరణం 4 వడ్డి కాసుల వాడ ననుచు
వడ్డి వడ్డీ గుంజెదవే ॥న॥
వేదవేద్యా శ్రీనివాసా
నిలచి ఉన్నావా తిరుమలా పైనా ॥న॥

చరణం 5 మాదు వెతలన్ని తెల్పి
నిన్ను శరణూ వేడితినే
మంగనాథా పాద దాసిని
కావ రావయ్యా జాలమేలయ్యా ॥న॥

## పాట:5 (చలమేలరా వరుస)

పల్లవి శంభో శంకరా కైలాసవాసా ॥శం॥

చరణం 1 నందీవాహనుడా గంగా గౌరి స్వామీ
వెలసియుంటివయ్యా శ్రీశైలమందు
చంద్రమౌళి నీవు తాండవంబునుండా ॥చం॥
భృగు ఋషి నీకూ శాపమిచ్చెనయ్యా ॥శం॥

చరణం 2 శాపా ఫలము చేత లింగ రూపమందీ ||శా||
పూజలందు వాడా పార్వతి నాథా
నీదు శిరము నందూ గంగా నుంచి తీవీ ||నీ||
నీదు గళము నందూ గరళ ముంచితీవీ ||శం||

చరణం 3 నీ రాక కొరకూ తపము చేయ గౌరీ ||నీ||
మారు రూపముతో వెడలితీవి నీవూ ||నీ||
ఆమె పూజలందీ వరము నిచ్చితీవీ ||ఆ||
కాశీలోన నీవూ వెలసి యుంటివయ్యా ||శం||

చరణం 4 మహనందిలోనా నీదు వాహనంబు
కను విందుచేయూ ముచ్చటాగ మాకూ ||మ||
బోళాశంకరా భక్త వరద నీవూ ||బో||
పద దాసిబ్రోవా కదలి రావదేలా ||శం||

## పాట:6 (పగడపు చనముల జాతర వరుస)

పల్లవి నంద కిశోరుని నామము ముక్తికి అది సోపానము ||నం||
అ ప|| నారాయణుని నామము నరకమునే తొలగించునూ . ||నం||

చరణం 1 జగతికి మూలము జగన్నాథుడే
అణువణువూనా నిండియుండెనే
నమ్మికొలువగా అభయమునిచ్చే
విష్ణుస్వరూపుడు అతడేలే ||నం||
చరణం 2 హరి నామమునకు సరియగు మధురం
ఇలమరి ఒకటున్నదా ||హ||
ఆ నామమునే నిరతము తలచి
ముక్తిని పొందర ఓ మానవుడా ||నం||

చరణం 3 ధూళి పట్టినా అద్దము నందు
ముఖబింబము కనిపించునా ॥ధూ॥
ఐహిక వాంఛలు మదిని నిండగా
భగవంతుడు కనిపించునా ॥నం॥

చరణం 4 మరణ కాలమున మదిలో భావన
ముందు జన్మకీ రూపము కాగా ॥మ॥
ఆ నామమునే నిరతము తలచే
వరమీయుమురా నీ పాదదాసికి ॥నం॥

## పాట:7 (గుండు మల్లెపూలు ప్రైవేటు పాట వరుస)

పల్లవి గుండు మల్లెపూలు తెచ్చి మాల లల్లి నానయ్యా
గిరిధారీ క్రిష్ణయ్యా పూజలంద రావయ్యా.. ॥గుం॥

అ ప॥ అర్తి తోటి నిన్ను పిలువ పిలుపు వినగ లేవాయే
అష్ట భార్యల కూడీ ఆద మరచి ఉన్నావో . ॥గుం॥

చరణం 1. కరిరాజు మొరలిడగా సిరికైనా చెప్పకుండ
కదలి వచ్చి కాపాడిన కమలనాభుడా ॥క॥
ఇడుములకూ వోర్వలేక ఇందుధరా అని పిలువా. ॥ఇ॥
సత్యభామ అలుక తీర్చ వెడలినాడవా
నా మొరలే వినలేవా కాపాడగ రావేలా ॥గుం॥

చరణం 2. సన్నజాజి సరులు తెచ్చి
సరసిజాక్ష నిన్ను పిలువ
శిలలాగా ఉన్నావా ఓ క్రిష్ణయ్యా
నవనీతా హృదయుడన్న బిరుదేలా నీకయ్యా ॥న॥
పాపాలను బాపి నన్ను కాపాడ రావయ్యా ॥గుం॥

చరణం 3 ఘడియ ఘడియ నిన్ను పిలచి
గొంతు తడీ ఆరిపోయె
మాటరాక ఉన్నానూ ఓ మాధవా
ఏ గోపిక చెంత చేరీ బృందావని చేరావో ॥ఏ॥
విన్నపాలు వీనులకూ వినిపింపగ లేదాయే ॥గుం॥

చరణం 4 గోపాలా బాలూడా గోపికాలోలుడా
ఏ భక్తుని ఇంట నీవు విందారగించావో
కదలేక ఉన్నావో నా తండ్రీ క్రిష్ణయ్యా ॥క॥
సుంతైనా దయను చూపి పద దాసిని బ్రోవవయ్యా ॥గుం॥

## పాట:8 (కొండలలో నెలకొన్న వరుస)

పల్లవి కొండపైన వెలసిన స్వామీ ఓ శ్రీనివాసా రావా
కొలచితి నిన్నే రావా కోనేటి రాయా రావా ॥కొం॥
సప్తశైల వాసా రావా శరణంటి కావగరావా ॥కొం॥

చరణం 1 పొర్లు దండాలు అంటూ భక్తజనులు వచ్చారయ్యా
ఒక్క అడుగు వేయలేని వారల ఆదుకొనగ రావేలయ్యా
విశ్వసించి శరణని వేడా చిన్న చూపు నీకేలా ॥కొం॥

చరణం 2 అడుగడుగూ దండాలు అంటు గోవింద నామము తలచి
గోడు వినగ పిలచేమయ్యా, గోవిందా రావేమయ్యా
వచ్చి వరము నీయవయ్యా ఓ శ్రీనివాసా రావా ॥కొం॥

చరణం 3 బహు దూరపు కనుమలలోనా
బండగాను నిలచేవయ్యా
నవనీత హృదయుడవంటే ఏరీతి నమ్మాలయ్యా ॥న॥
ఈ పరీక్ష ఎన్నాళ్లయ్యా కనికరించి రావేలయ్యా. ॥కొం॥

చరణం 4 కాసులన్ని ముడుపులు కట్టి
నిన్ను పిలువ పలికెదవయ్యా
ఒక్క కాసు ఈయగలేనీ భక్తజనుల చూడగలేవా
కాసులకే మురిసే వంటే నిన్ను మేము పిలువగ నేలా ||కొం||

చరణం 5 కలియుగా వైకుంఠ మనుచూ
పేరొందిన తిరుపతి కొండా
నేనెక్కి రాలేనయ్యా
నీదరికీ చేర్చగరావా ||క||
నీ పాదదాసి పిలువా అలివేలునాధా రావా ||కొం||

## పాట:9 (మనసార నిన్ను పిలువ వరుస)

పల్లవి మనసారా నిను పిలువ మరుగేలరా
శ్రీశా, మా ఈశా, శేషాద్రివాసా ||మ||

చరణం 1 రాముడవైనా క్రిష్ణుడవైనా, రమణుడవైనా అన్నీ నీవని
వేయి నామముల పిలచి వేడితిని
పలుకగ రావయ్యా, పరమాత్మ దేవా ||మ||

చరణం 2 ఎదురుగ నిలచిన ఇహభోగాలు
కన్నుల ముందు కదలుచుండగా
నిన్ను తలవగా మనసు నిలువదూ
అంతర్ముఖముగా నామది నిలుపగ
వేడితి నిన్నే వెంకటేశ్వరా ||మ||

చరణం 3 సుఖ దుఃఖములను సమముగ ఎంచి
నీ పదములనే శరణని వేడితి
వేగమె రావయ్యా వేణుగోపాలా
కరుణ చూడరా కమనీయ రూపా. ॥మ॥

చరణం 4 కమల దళాక్షా కామిత దాయకా
కొలువు తీరగ రావా నామదిలో నీవు
శాంతిని చూపి బ్రోవగ రావా
పద దాసి పిలువగ జాగేలనయ్యా ॥మ॥

## పాట:10 (తిరువీధుల వరుస)

పల్లవి తిరువీధుల విహరించే దేవదేవా
తనివి తీరలేదయ్యా నిన్ను చూడా ॥తి॥

చరణం. 1 గరుడ వాహన మెక్కి గగనాన విహరించె
గరుడాద్రి వాసుడా ఓ శ్రీనివాసుడా
ముక్కోటి జనులెల్లా నిన్ను కొలువగ రాగా
కొండపై కొలువున్న కోనేటి రాయా ॥తి॥

చరణం 2 బంగారు రథముపై బంగారు కాంతితో
మెరసేటి తండ్రి ఓ వెంకటేశా
చల్లనీ నీ చూపు ప్రసరించు మా వైపు
పద్మావతీ నాథా. తిరుమలగిరి వాసా . ॥తి॥

చరణం 3. ఏడు కొండలపైనా ఏల వెలసినావయ్యా
ఈ భువిలో ఏ పురిలో చోటే కనరాలేదా
నీ దరికీ చేరలేనీ నీ భక్తజనులా . ॥ఏ॥
కాపాడ రావయ్యా కొండ దిగి రావయ్యా ॥తి॥

చరణం 4 సప్తగిరీ శిఖరాన సిరులతో వెలసేవా
మా ఇంట కొలువుండ నిన్ను పిలచేనయ్యా
నీ దాస దాసిగా నన్ను చేర్చగ రావా
వరమీయ రావయ్యా వర వెంకటేశా ॥తి॥

## పాట:11 (జానపదం)

పల్లవి : రావయ్యా రావయ్యా రామయ్యా
మా ఇంటికీ నీవు రావయ్యా ॥రా॥

అ ప॥ మా ఇంటికీ వచ్చి మమ్ములను కాపాడు
అయోధ్య వాసుడా ఆనందరూపుడా. ॥రా॥

చరణం 1. ఏ జన్మలో నేను ఏ పాపమో చేసా
ఈ జన్మలో నిన్ను తలవలేకున్నాను ॥ఏ॥
ఆజానుబాహుడా అరవిందనేత్రుడా
అండజా వాహానా నీ అండ చూపగ రారా. ॥రా॥

చరణం 2 ఇహలోక బంధాలు వీడ లేకున్నాను
పదములు చేర నిన్ను తలవలేకున్నాను ॥ఇ॥
నామదిలో నిన్ను నిలిపాను నిరతమ్ము
నీల దేహా నీవు మా ఇంటికీ రావా ॥రా॥

చరణం 3 ముదమారా పిలచేను మునిజన వందితా
మారుపల్కు వేమి రామయ్యా ॥ము॥
భద్రాద్రి వాసూడా సీతాసమేతుడా
మా సేవలందగా బిరాన రావయ్య ॥రా॥

చరణం 4 విన్నవించానయ్యా - నీ బంటు హనుమకూ
ముందుగానే నేను రామయ్యా ॥వి॥
ఎన్నాళ్ళు వేచేను నీ రాక కోసము
కదలి వచ్చి మమ్ము కాపాడ రావయ్య ॥రా॥

చరణం 5 కదలక ఉండాలి మా ఇంట నీ వెపుడు
కమలలోచన రామ రావయ్యా
నేనంత పిలచీనా పిలువు వినగా లేవా
ఆ వాయు నందనుడు చెప్పనైనా లేదా ॥రా॥

చరణం 6 వైదేహి నీదు పదములూ పట్టగా
పవళించినావా రామయ్యా
భానూడు ఉదయించు వేళాయె రామయ్యా
పద దాసి పూజలు అందగ రావయ్యా ॥రా॥

## పాట:12 (సీతారామస్వామీ వరుస)

పల్లవి తిరుమల తిరుపతి దేవా నే చేసిన నేరంబేమీ
అ ప॥ ఎంత పిలచినా ఏల పలుకవూ ఏడుకొండలా వెంకటరమణా

చరణం 1 కోటికి పడగలు ఎత్తిన వాడా
కాసుల పేర్లూ దాల్చిన వాడా
కూటికి లేదని అడుగగ లేదూ
పదములు కడగగ పిలచితి గానీ ॥తి॥

చరణం 2 సామజ వరదుడ
శ్రీనివాసుడా
సప్తశైలముల వెలసిన వాడా
సుందర రూపుడ శరణని వేడగ ॥తి॥

చరణం 3 ఇహమున ఇడుములు ఎంతగ వచ్చిన
నామము విడువక పాడితి గానీ
కరముల చాచీ కాసులు నిన్ను
ఇవ్వగ రమ్మని పిలువగ లేదు ॥తి॥

చరణం 4 భక్తజనులను పాలించుటకూ
వెండి కొండపై వెలసిన వాడా
నీ దాస దాసిగా పిలచితినయ్యా
కన్నీట నీదూ పదములు కడిగెద ॥తి॥

## పాట:13 (భజన)

పల్లవి నంద నందనా రా రా నవనీత చోరా రారా
దేవకి నందన రారా దరిశనమీయగ రారా ॥నం॥

చరణం 1 దశరథనందన రారా రావణవైరి రారా
సీతారామ రారా ..రఘుకుల తిలకా రారా

చరణం 2 బోళాశంకర రారా భక్త వరదా రారా
శంభోశంకర రారా చింతలు బాపగ రారా

చరణం. 3 శ్రీనివాసా రారా శ్రీ వెంకటేశ రారా
పద్మానాథా రారా . పాపము బాపగ రారా

చరణం 4 పండరి నాథా రారా .పాండురంగా రారా
విఠల విఠల రారా జై జై విఠల రారా

చరణం. 5 శబరి గిరీశ రారా అయ్యప్ప స్వామీ రారా
శరణం శరణం అయ్యప్పా జ్యోతి స్వరూపా అయ్యప్పా.

చరణం 6 ఆంజనేయా రారా అంజని పుత్ర రారా
అతి బలవంతా రారా పదదాసి పిలచేను రారా

## పాట:14 (రామాలాలీ వరుస)

పల్లవి కన్నాలాలీ నల్లని కన్నాలాలీ
తామారాసా నయనా దేవకి నందన లాలీ ॥క॥

చరణం 1 గోకుల వాసా గోపాల బాలా
క్రిష్ణాలాలీ పూతన కూల్చి
అలసితివయ్యా అచ్యుత లాలీ ॥క॥

చరణం 2 నంద నందనా నవనీత చోరా
జోలా పాడితినీ ఆటలు మానీ అరడి చేయక
నిదురా పోవయ్యా ॥క॥

చరణం 3 వేణు విలోలా వేణుగోపాలా
వంశీ క్రిష్ణయ్యా - పట్టూ పానుపు వేసామయ్యా
పవళించావయ్యా ॥క॥

చరణం 4 మల్లెల పానుపు వేసామయ్యా - మాధవ లాలీ
జోలా పాడీ జోకొడుతానూ నిదురా పోవయ్యా ॥క॥

చరణం 5 పాదదాసీ పిలచేనయ్యా - పరమాత్మా లాలీ
దశరూపములూ నీవేనయ్యా నిదురించా రావయ్యా ॥క॥

## పాట:15 (కాసుకంటే ప్రైవేటు పాట వరుస)

పల్లవి కాసు కంటే విలువైనది కాలమూ
తిరిగి రాదు తొలగిన ఆ కాలము ॥కా॥

చరణం 1 ముందెప్పుడో భగవానుని తలవాలనే భ్రాంతి వీడూ ॥ముం॥
ముగియునమ్మ ఏ క్షణమో నీ ఆయువూ
పిన్ననాటి నుండి నీవు పరమాత్ముని తలచేవా
మరణ కాల మందైనా మరపురాదు ఆనామం పరమాత్మ నామం ॥కా॥

చరణం 2 కాలహరణమేల నీకు కమలాక్షుని కొలువగాను
కదలిరారు ఏలనో ఓ నరులారా
నేలలోన నింగిలోన పంచ భూతాలలోన
నిండియున్న పరమాత్ముని కొలువగ రారే ॥కా॥

చరణం 3 బంధువులె శాశ్వతమని కాలగమనమెరుగ లేక
కాసులే లోకమనీ భ్రమియించారా
కాసులే లేని నాడు కదలి రారు నీ దరికీ
పుత్రులైన పౌత్రులైనా ఓ మానవుడా ఓ మానవుడా ॥కా॥

చరణం 4. పరమాత్మయే తెలిపాడు - ఆనాడు పార్థునికీ
భయమేదీ లేదనీ నన్ను నమ్మ వారికనీ
గీతార్థసారమునూ మదిలోనా నిలుపుకొనీ
భజన చేయ రారండీ ఓ జనులారా ఓ జనులారా ॥కా॥

## పాట:16 (పగలే వెన్నెలా వరుస)

భద్రాద్రీశుడా ఓరఘురాముడా
సీతా సమేతుడా - రామచంద్రుడా ఆ ॥భ॥

చరణం 1 గోదావరి తిరానా నీదు ఆలయం
భక్తజనుల సందోహం ఆప్రాకారం
సుందర రూపుడా శాంతస్వరూపా
కాపాడ రావయ్యా కోదండరాముడా . . ఆ . ॥భ॥

చరణం 2 వేదాలే వల్లించును నీదుచరితమూ
మునులెల్లా . భజియింతురు నీదునామమూ ॥వే॥
కారణజన్ముడా కౌసల్యతనయుడా
కాపాడరావయ్యా . .కల్యాణరాముడా . ఆ. ॥భ॥

చరణం 3 పాపాలను పారద్రోలు పరమపురుషుడా
శంఖచక్ర గదాధరా పద్మహస్తుడా
శబరికి మోక్షమూ ఇచ్చితివీవనీ
మనసారా నిన్నుకొలువ మౌనమేలరా . .ఆ... ॥భ॥

చరణం 4. సౌమిత్రి నీదుసేవ చేయుచుండగా
మారుతేమో నీదు పదము పట్టుచుండగా
ఏ విధి నీకు నేసేవలు చేతురా
ఈ రాధను బ్రోవ నీవు కదలి రావయ్యా .. .. ॥భ॥

## పాట:17 (భలే మంచిరోజు వరుస)

మహదేవ రావా సదాశివా రావా
సదామమ్ము బ్రావా సర్వేశరావా ॥మ॥

చరణం 1 హిమవంతుని పుత్రికనీకై
ఘోరమైన తపమును చేయా
కదలివచ్చి పార్వతినీ చేపట్టిన శంకర రావా
కైవల్యమీ యుగరావా కైలాసవాసా రావా .. ॥మ॥

చరణం 2. అజ్ఞానమును చీకటిలోనా
అలమటించు చున్న నాకూ
జ్ఞానజ్యోతి చూపించి ఆదుకొనగరా. . వేమీ
పాపాలను బాపి మమ్ముకాపాడరావా వేమీ. . ॥మ॥

చరణం 2 సాయీ మహరాజ్ అంటూ నీకూ జయమును పలికేమూ
శిథిలంబైనా మసీదు నీకూ రాజభవనమయ్యా
ధూనీలొని విభూదినీకూ ధనాగారమయ్యా
చినిగి ఉన్నా కఫ్నియే నీ పట్టువస్త్రమయ్యా ॥సా॥

చరణం 3 సట్కాకాయే రాజదండముగ నిలిచి ఉంటివయ్యా
శిరమున చుట్టిన రుమాల నీకూ రత్నకిరీటమయ్యా
ఇటుక రాయి గొనె సంచులే పట్టుపరుపులయ్యా
మసీదు ముంగిట శిలయే నీకూ సింహాసనమయ్యా. ॥సా॥

చరణం 4 భుజమున జోలీ మట్టికుండలే స్వర్ణపాత్రలయ్యా
భక్తితో పెట్టె రొట్టెయే నీకు ప్రీతినిచ్చునయ్యా
ప్రతిజీవి నీ రూపంబనుచూ చాటిచెప్పినావూ
ప్రసాదంబుగా ఊదీవిచ్చీ పాపములు బాపేవూ ॥సా॥

చరణం 5 శిరమును ఒంచీ నీపదములనే శరణనివేడితిరా
దీవెన ఇచ్చి కాపాడుమురా సాయీనాధారా
సద్గురునాధా సాయీనాధా సరగునరావయ్యా
శరణని వేడిన జాలము ఏలా సాయీనాధారా ॥సా॥

చరణం 6 అభయమునిచ్చీ ఆర్తినిబాపీ తోడుగనిలచేవూ
చేయూతనిచ్చీ చింతలు బాపీ రక్షణఇస్తావూ
దత్తస్వరూపా సాయీనాధా దరిశనమీయగరా.
అన్నిరూపములు నీవే అంటూ నీదాసి పిలచెనయ్యా. .. ॥సా॥

## పాట:19 (అదిగో అల్లదిగో వరుస)

అదిగొ అల్లదిగో శ్రీదేవ దేవి
సుగుణాలరాశి ఓ కల్పవల్లీ ||అ||

చరణం 1 చెంగున ఆ కృష్ణ గల గల పారగ
ఆకొండ శిఖరాన కొలువున్న ఆ దేవీ
బంగారు చాయతో సౌందర్య మొలక
కనువింపుచేసేటి ఆ కనకదుర్గా ||చె||

చరణం 2 విశ్వజనని విశ్వేశురాణీ
విశ్వమంతా పాలించు జననీ
నీనామ మంత్రం భవభయ హరణం
నీచరణ కమలం మోక్షదాయకం ||వి||

చరణం 3 అనురాగ మొలికించు నీకరములందు
వేదలీరగ నేను నిన్ను వేడితి తల్లీ
ఈ సాధనింకా ఎన్నాళ్ళు తల్లీ
దయచూడు మా తల్లి మహేశురాణి ||అ||

చరణం 4 కోటి సూర్యుల కాంతి స్వరూపిణీ
కోటి ధనమిచ్చిన కనుపించవీవమ్మా
మనసారా ఒకసారి ఎలుగెత్తి పిలువగ
పరుగున కాచేటి రాజరాజేశ్వరీ ||కో||

చరణం 5 నవరాత్రి దీక్షతో నిన్ను కొలచిన చాలు
చల్లనిచూపులు ప్రసరించు మా తల్లీ
పదదాసి కొలచేనూ - నిన్ను పిలచేనూ
హారతిగొనుమా - మా గౌరి శ్రీ గౌరి ||అ||

## పాట:20 (తెలిసిందిలే వరుస)

పల్లవి కళ్యాణివే కాత్యాయినీ సౌందర్యలహరివి నీవేనులే ||క||

చరణం 1 త్రిభువన పోషిణి నీవేనులే
దుఃఖనివారిణి సింధుసుతీ
సేవింతునే నిను పూజింతునే
మదిలోన నీరూపు నిలిపానులే నిలిపానులే ||క||

చరణం 2 మంత్ర స్వరూపిణి మంత్రమయే
భవభయహారిణి భైరవివే ||మం||
దయచూడవే నీ దరిచేర్చవే ||ద||
దరహాసవదనా శరణంటినే శరణంటినే ||క||

చరణం 3 రాగవివర్ధిని జ్ఞానమయే
మానసవందిత పాదయుతే
పాలింపవే మముసోధింపకే ||పా||
పరాకు చేయుట నీకేలనే . నీకేలనే ||క||

చరణం 4 భారతి భార్గవి నీవేనులే
భారమునీదని వేడితినే ||భా||
హారతిదే గైకొనవే ||హా||
ఈ రాధ హృదయాన నిలవాలిలే నిలవాలిలే ||క||

## పాట:21 (రారా కృష్ణయ్యా వరుస)

పల్లవి రారా గోపాలా రారాగోపాలా ||రా||
లాలించి పాలింప రారా గోపాలా

చరణం 1 మన్నుతిన్న ఆనోటను మిన్నులెన్నో చూపిన
మహిమలేన్నో చూపిన మాధవ రావేలా
హరిషడ్వర్గములకు బంధీనై ఉంటినిరా
ఈ చెరను బాపరారా మురవైరి రావేలా ॥రా॥

చరణం 2 ఈ దేహం క్షేత్రమని నీనామం బీజమని
తలచి ఉన్న నాకు నీవు జ్ఞానమనే పంటను
నామదిలో పండించగ రావయ్య
నందనందనా రారా దర్శనంబు ఈయవయ్యా ॥రా॥

చరణం 3 మోహమునకు వెనువెంట క్రోధము కదిలేను
కామక్రోధములు చేర జన్మవిలువ మరచేము
మాయ కమ్మి మమ్ము మేము మరచి ఉన్నామయ్యా
ఈతెరను తొలగించి నీరూపు చూపవయ్యా
నిన్ను చూడ వేచినాను కనిపించగ రావయ్యా ॥రా॥

చరణం 4 వెన్న తిన్న ఆనోటనే నీవు మన్నుతిని మాకు
పరమార్థము తెలిపినావు ఎరుగలేక ఉన్నమాకు
వెన్న మన్ను ఒకటనీ అన్నిటనే ఉంటివనీ
ఎరుగలేక ఉంటిమయ్యా నీలీలలు కన్నయ్య
వర్ణింపగ ఎవరి తరము నీలీలలు పరమేశా ॥రా॥

చరణం 5 విషాదము మదినిండ విష్ణువునే తలచేము
విషయవాంఛలు వీడ వైకుంఠము చేరేము
వేయి నామాలవాడ లోక రక్షక రావయ్యా
నీ భక్తుల బ్రోవవయ్యా నీలవర్ణ రావయ్యా ॥రా॥

**పాట:22** **(అంతర్యామీ వరుస)**

పల్లవి అంతర్యామి అలసితినయ్యా
నీ పదమే శరణంటినిరా ||అం||

చరణం 1 ఇన్ని నీవనీ అంతట నీవనీ
తెలిసితినయా - గోవిందా
నీకన్న మిన్న అందము భువిలో
లేదని తెలిసితి గోవిందా
నీరూపమునే కన్నుల విందుగా చూడకోరితిని గోవిందా ||అం||

చరణం 2 తిరులపైన స్థిరముగ నిలచీ
అభయము నొసగే భక్తవరదా
తెరతీసి నాలోనీ తిమిరాలు హరియించరా
హరీ -హరీ - హరీ ||అం||

చరణం 3 ఇహముల ఇడుముల తాళగలేకా
అంధకారమే ఆవహించగా
దారిచూపరా తిరుమలేశా
మనస్సుకి శాంతి కరువాయెనురా
పలుకవేమిరా వెంకటేశ్వరా ఆ ||అం||

చరణం 4 నీ పద తీర్థమే దివ్యౌషధము
మోహపాశములు బాపేమందు
పరమదయాళో పాలింపుమురా
పతిత పావనా పలుకవేమిరా ||అం||

**పాట:23** **(స్వాగతం సుస్వాగతం వరుస)**

పల్లవి వందనం అభివందనం
వందనం ఓనందకుమారా ॥వం॥

చరణం 1 చల్లనైన ఆచంద్రుడు నీవె
కాంతులీను ఆభానుడు నీవె
శంఖ చక్రగదా ధారుడ నీవే ఆ ॥శం॥
మాతల్లీ తండ్రివి నీవే
నాదుగురువు నాదు శక్తి నా సర్వము నీవే ॥వం॥

చరణం 2 గోపీ మానస చోరుడు నీవే
రాధా మాధవ రూపమునీవే
వేణుగాన ప్రియ వేదోద్ధారా వే॥
మాధవ దేవా మోహనరూపా
మాయ బాపి నన్ను బ్రోచి
నిన్ను చేరు దారి చూపు ॥వం॥

చరణం 3 నీల వర్ణుడా నందకుమారా
నాశనరహితా నారాయణుడా
నిత్యము సత్యము నీవే కాదా ఆ ॥ని॥
సత్యాపతి నీవిరుదే కాదా
విశ్వంభరుడా వాసుదేవుడా
మాకు అండ దండ నీవేకాదా ॥వం॥

చరణం 4 రఘుకుల తిలకా శ్రీరఘురామా
పన్నగ శయన నారాయణుడా
రమా సహిత ఓ సత్యదేవుడా
అన్నవరములో వెలసినవాడా ఆ ॥అ॥

నీదు కరము అభయమిచ్చి
నాదు సేవ స్వీకరించి దీవింపుమయా ॥వం॥

చరణం 5 కామక్రోధముల ప్రాబల్యమున
చిక్కియుంటినీ మాయకు లొనై
జనన మరణముల చక్రముబాపే ఆ ॥జ॥
బంధువు నీవే నీరజాక్షుడా
అణువు అణువు నిండియుండ
నీదు దాసి నిన్ను పిలువ
కానరావా కదలిరావా ॥వం॥

## పాట:24 (రామా లాలీ వరుస)

పల్లవి 1 అంబాలాలీ - జగదంబాలాలీ
కంబుకంఠురాణీ - కళ్యాణి లాలీ ॥అం॥

చరణం 1 త్రేతాయుగమున రామునిసతివై సీతాలాలీ
ద్వాపరయుగమున కృష్ణుని సతివై రుక్మిణి లాలీ
ఈ యుగమందున వెలసితివమ్మ అలివేలుమంగమ్మ
మల్లెలపానుపు వేసామమ్మ మంగాలాలీ ॥అం॥

చరణం 2 లాలీ పాడి లాలించేము లలితాలాలీ
జోలాపాడి జోకొడతానూ జోస్నా లాలీ ॥అం॥

చరణం 3 పట్టుపానుపు వేసామమ్మా పార్వతి లాలీ
పదములపట్టి జోకొడతాను దుర్గా లాలీ ॥అం॥

చరణం 4 కంచిలోన వేలసితివమ్మ కామాక్షివి నీవూ
మధురాలోన వెలసిన తల్లి మీనాక్షివి నీవు
కాశీలోన వెలసితివీవు అన్నపూర్ణవుగా
జోలపాడి జోకొడతాను నిద్ర పోవమ్మ ॥అం॥

**పాట:25** **(కలువరేకుల వరుస)**

పల్లవి కలువ పూవులు తెచ్చి కమాలాక్షు నర్చింప
కాలయాపన ఏల నరుడా
నారాయణా అని నామస్మరణ చేయా - జాలమేలనయ్యా నరుడా ||క||

చరణం 1 భక్తవరదుని కొలువ అభయమ్ము నిచ్చేనూ
ఆదుకొనువాడతడు నరుడా
నమ్మి పిలచిన వారి నీడగా ఉండేను నరుడా ||క||

చరణం 2 పట్టువస్త్రము కట్టి పడతి లక్ష్మిని గూడి
ఆ స్వామి నర్చించు నరుడా
అభయమ్ము నిచ్చి నిన్ను కావగ రాడా
ఏడుకొండల వాడు నరుడా ||క||

చరణం 3 సంసార బంధాలు బాప వేడుగ రావా
ఆ శ్రీనివాసునీ నరుడా
పదదాసి బ్రోచెనూ పాలింప కదలేనూ
ఆ శ్రీనివాసుడు నరుడా ||క||

చరణం 4 ఏడి నాస్వామనీ
ఏడేడొ తిరిగావు నరుడా
పాల సముద్రం పైన
శేష పానుపుపైన పవళించు ఆ స్వామి నరుడా
నీలోనే ఉన్నాడు నరుడా
నీ ఎదలోనే ఉన్నాడు నరుడా ||క||

చరణం 5 ఇందుగలడందులేడని
సందేహము వీడి భక్తితో కొలువరా నరుడా
నిజభక్తితో కొలచి చేదుకోమనినంత

చేయూత నిచ్చేను నరుడా-
ఆ తిరుమలా వాసుడు నరుడా ||క||

## పాట:26 (అయిగిరి నందిని వరుస)

పల్లవి వందనమమ్మ మహాలక్ష్మమ్మ
మా ఇంటికి నీవు రావమ్మ శ్రావణ మాసపు
శుక్రవారము పూజలందగా రావమ్మ ||వం||

చరణం 1 పచ్చని ఆకుల తోరణములూ ఆ సనంబుగా నీకు వేసితినీ
కాలిగజ్జెలు ఘల్లని మ్రోయగ శ్రీ వరలక్ష్మిరావమ్మ ||వం||

చరణం 2 పసుపూ కుంకుమ పూవుల తోటె
పూజలు చేయగ పిలిచితినీ
నీరజ నేత్రి నన్ను కావగా
కదలి రాగదే శ్రీలక్ష్మి || వం||

చరణం 3 అష్టలక్ష్మిగా వెలసితివీవే
అభయము నొసగ రావమ్మ
విద్యలనొసగి వినయము నొసగి విద్యాలక్ష్మిరావమ్మ ||వం||

చరణం 4 పాలకడలిలో ప్రభవించితివీ
సుందర రూపిణి నీవమ్మ
నారికేళములు నైవేద్యముగా ఆరగించగా రావమ్మ ||వం||

చరణం 5 పంచ భక్ష్యములు చిత్రాన్నములూ
ఆరగించగా రావమ్మ
హారతి ఇచ్చి వేడితినమ్మ దీవింపగ నీవు రావమ్మ ||వం||

చరణం 6 పురాణయుగమున చారుమతిని నీవు
కరుణతో చూడగ కదలితివే
ఈయుగమందున భక్తుల బ్రోచి దీవింపగ నీవురావమ్మ ||వం||

చరణం 7 ఐదవ కనము ఈయుగనిన్ను
వేడితినమ్మ మాజననీ
కంటిరెప్పగా కావగరావా
శరణం శరణం వరలక్ష్మీ
శరణం శరణం మహాలక్ష్మి
శరణం శరణం శ్రీలక్ష్మీ ॥మం॥

## పాట:27 (ఘలు ఘలునా పాదగజ్జలు మ్రోయగ వరుస)

పల్లవి నల్లని కన్నయ్యా మాధవా కేశవా
మా హారతందగా రావేలయ్యా
ద్వారకా వాసుడా వసుదేవాతనయుడా
మంగళహారతి గైకొనరావా మంగళం మంగళం ॥న॥

చరణం 1 నవనీత చోరుడా నందకుమారుడా
గైకొన రావయ్యా నీరాజనం
కర్పూర హారతి కన్నయ్యా నీకిదే
అందాల కృష్ణయ్యా అందగా రారా మంగళం మంగళం ॥న॥

చరణం 2 బాల ప్రాయమున పూతాన వధియించి
రక్కసి కూల్చిన ఓ కృష్ణయ్యా
పవ్వాల హారతీ అందాగ రావయ్యా
మోహన రూపుడా జాగేలనయ్యా ॥న॥

చరణం 3 అక్షయా పలువాలూ ద్రౌపతికిచ్చావూ
దీనాబాంధవా నీవు రావేలయ్యా
అక్రూర వరదుడా వనమాలధర నీవూ
మా హారతందగా రావేలనయ్యా మంగళం మంగళం ॥న॥

చరణం 4 వేదాలు కావగా మీన రూపము దాల్చిన
ఆ విష్ణుస్వరూపుడు నీవేనయ్యా
ప్రహ్లాదవరదూడా ఓ నారశింహుడా
ఈ హారతందారా పాదదాసి పిలచేనూ మంగళం మంగళం ॥న॥

## పాట:28 (జానపదం వరుస)

పల్లవి ఓ బొజ్జగణపతీ రా నీకు శిరసొంచి మ్రొక్కేదరా ॥ఓ॥
అనుపల్లవి శిరసొంచి మ్రొక్కేనూ మూషీకా వాహనా
మునిజన వందితా ముదమార రావయ్యా ॥ఓ॥
చరణం 1 ఏపూజచేసీనా ఏక దంతా నిన్ను
మును ముందు పూజింతు వినాయకా
విఘ్నాలు తొలగించు వేయి దండాలయ్యా
అయినవల్లీ లోన వెలసి ఉన్నావయ్యా ॥ఓ॥
చరణం 2. గగనానా విహరించు శశి నిన్ను చూచాడు
హేళనగా నవ్వేను వినాయకా
నీతల్లి కోపించి శాపమిచ్చేనయ్యా
శాపాలు ఏరీతి బాపాలో తెల్పవయ్యా.. ॥ఓ॥
చరణం 3 చవితి పూజ చేసి నీ కథను చదివీనా
అపదలు బాపేవు వినాయకా
చల్లగా చూడాలి నీ భక్త జనులను
కరుణించ రావయ్యా గణముల నాయకా ॥ఓ॥
చరణం 4 వ్యాసూడు నినుపిలువ ఘంటమును చేపట్టి
వేదాలు వ్రాసావు వినాయకా
కర్పూర హారతి అందగ రావయ్యా
దీవింప రావయ్యా లంబోదరా నీవు ॥ఓ॥

చరణం 5 ఉండ్రాలు పోసేము గజముఖా వరదుడా
మమ్మేల రావయా - వినాయకా
ఈశ్వరా పుత్రుడా - ఈపూజలందరా
ఇడుములూ బాపరా-కుడుములూ పెట్టేద ॥ఓ॥

## పాట:29 (అంబ వందనం వరుస)

పల్లవి శంభో వందనం శివ శంభొ వందనం
శిరశోంచి నీకు సదాశివా వందనం ॥శం॥

చరణం 1 పులి చర్మం ధరియించి పార్వతిని చెపట్టి
గంగనేమో శిరమందు ధరియించావూ
పాపనాశరావయ్యా పరమేశా రావయ్యా
కలుషాలూ బాపవయ్యా గౌరీశా రావయ్యా ॥శం॥

చరణం 2 పాదపూజ చేయ నిన్ను పిలచినాను రావయ్యా
రత్నాల పీట వేసి పిలిచాను రావయ్యా
అర్ఘ్యమిచ్చి నాను నీకు ఆదిదేవ రావయ్యా
పూజలందరావయ్యా జటధరా రావయ్యా ॥శం॥

చరణం 3 విశ్వేశ్వర రావయ్యా విన్నపాలు వినవయ్యా
ఆత్మజ్యోతి వెలిగించి ఆదరింప రావయ్యా
పాదాభివందనమూ ఫాలనేత్ర రావయ్యా
హర హర హర అని నిన్ను నేను భజన చేసినినాయ్యా ॥శం॥

చరణం 4 ధ్యానముతో నిన్ను కొలువ
మనసు నిలుప లేనయ్యా
గానముతో నిన్ను పిలువ-మూగబోయె గళమయ్యా
ఏ రీతి నిన్ను కొలిచి నిన్ను చేరగలనయ్యా
ఏదారి కానరాక నిలచి ఉన్నా నయ్యా ॥శం॥

చరణం 5 అభిషేకము చేసి నీకు
నైవేద్యమిచ్చాముా
హారతిచ్చినానయ్యా అందగారావయ్యా
కార్తీక మాసానా శివకేశవులోకటనచూ
పూజచేసి నానురావా పదదాసిని బ్రోవరావా ॥శం॥

## పాట30

వర్ణింప ఎవరి తరము
విశ్వేశ్వరుని సుందర రూపము ॥వ॥

1 పాల సంద్రమును చిలికేటి వేళా
హాలాహలము ప్రభవించగా ॥పా॥
గళమున గరళము నిలిపిన స్వామిని
ఆ నీలకంఠుని, మృత్యుంజయుని ॥వ॥

2 ప్రదోష వేళ-పార్వతి సరసన
దిమి, ధిమి, తకధిమి తాళము మ్రోగా
నాట్యము చేసే నటరాజు రూపం
చిదంబరేశుని సుందర రూపము ॥వ॥

3 కార్తీకమాసాన అభిషేకాలు
అమరావతిలో ఆ లింగరూపాన
చూచువారలకు జన్మ ధన్యము
భుక్తి నొసగే పరమేశు రూపము ॥వ॥

## పాట: 31 సాంబశివస్తోత్రం

మునిజన వందిత మోక్షప్రదాయక
విశ్వేశ్వర హర జరాధరా
శిరమున గంగను గళమున గరళము
దాల్చిన వాడా సాంబశివా

(31)

1 త్రినేత్రధారీ త్రిపుర సంహారీ సాంబశివా
జయ జయహే కైలాస నివాసా
సాంబశివా జయ పాలయమాం

2 భయమును బాపి, అభయము నొసగే
అసుర సంహరా సాంబశివా
శ్రీశైలంబున వెలసితివయ్యా
నంది వాహనా సాంబశివా
చంద్రమౌళి అని, చంద్రధరా అని
పిలిచిన పలికే సాంబశివా
జయ జయహే కైలాస నివాసా
సాంబశివా జయ పాలయమాం

3 బ్రహ్మ, మురారీ సన్నుతి సేయ
నాట్యము సలిపిన సాంబశివా
ప్రదోషవేళ పార్వతి సరసన
తాండవ మాడిన సాంబశివా
రావణదర్పము నాశము చేసిన సాంబశివా
జయ జయహే కైలాస నివాసా
సాంబశివా జయ పాలయమాం

4 బిల్వదళప్రియ భీమేశ్వర ఓసాంబశివా
ద్రాక్షారామము నీఆలయమైవెలసితివయ్యా సాంబశివా
నాగా భరణా, నందివాహనా సాంబశివా
దీనుల బ్రోవగ దీనమందారా
దిగంబరేశ్వర సాంబశివా
వేడిన వారికి వరముల నిచ్చే భోళా శంకర సాంబశివా
జయ జయహే కైలాస నివాసా
సాంబశివా జయ పాలయమాం.

5 దశకంఠుడు నిను సన్నుతి సేయగ
ఆత్మలింగమును ఇచ్చితివే
నిన్నుచూడగా వేడితినయ్యా, నన్ను బ్రోవరా పరమేశా
రాధాదేవీ పిలిచినదయ్యా, రాక్షస సంహరా సాంబశివా
లింగ రూపమున వెలసితివయ్యా
రామేశ్వరమున సాంబశివా
అభిషేకాలను అందెదవయ్యా
అంధకారమును బాపెదవయ్యా సాంబశివా
జయ జయహే కైలాసనివాసా
సాంబశివా జయ పాలయమాం

6 భస్మాసురునకు వరముల నోసగి
వెతలను చెందిన సాంబశివా
మోహిని రూనము దాల్చిన విష్ణువు
నిన్నుకాచెరా సాంబశివా
వారణాశిలో వెలసితివయ్యా జటాధరా హర సాంబశివా
జయ జయహే కైలాసనివాసా
సాంబశివా జయ పాలయమాం

## పాట:32 (ఆకాశమా నీవెక్కడా వరుస)

పరమాత్ముడా నీవెక్కడా?
నాఆత్మలోనే నీఉంటివా . . ॥ప॥

1 మబ్బు కమ్మిన భానుని వోలే
మోహము చుట్టెను నాకన్నులకు
మాయను బాపి నిజమును తెల్పి
నిను చేరుదారీ చూపించవా ॥ప॥

2 ఎన్ని జన్మల పుణ్యమో గానీ
ఈ నర జన్మ పొందితినయ్యా
మనసు నిలువదు, ఇహము మరువదు
నిను తలచు శక్తి నాకీయవా ॥ప॥

3 కాషాయ వస్త్రాలు ధరియించినా
నిర్జన అడవుల నివసించినా
మనసున మోహము విడలేని వారు
నిను చేర తరమా నారాయణా ॥ప॥

4 భూమధ్యమునా దృష్టిని నిలిపి ॥ప॥
అన్యము తలవక మది నిన్ను నిలిపి
ధ్యానము సలిపి ధన్యత నొందే
వరమీయవయ్యా విశ్వేశ్వరా ॥ప॥

## పాట.33

రావమ్మ రావమ్మ మా లక్ష్మి రావమ్మ
మాపూజలందగా మమ్ము దీవింపగా ॥రా॥

1 మల్లె, మందారాలా మాలలే వేసాము
పసుపు కుంకాలతో పూజలెన్నో చేసాము
మా మనవి వినవమ్మా దీవింప రావమ్మా ॥మ॥
వరమీయ రావమ్మా వరలక్ష్మి నీవమ్మా ॥రా॥

2 కన్నెపిల్లలు నిన్ను కొలిచేటి వేళ
కళ్యాణ ప్రాప్తిగా దీవించవమ్మా ॥క॥
ముత్తైదు లందరూ కొలిచేటి వేళ
పసుపు కుంకాలిచ్చి కాపాడవమ్మా ॥రా॥

3 కాత్యాయినీ నిన్ను కోరి కొలిచేము
కరుణించవమ్మా, కదలిరావమ్మా ||కా||
రాజరాజేశ్వరి శరణంటిమమ్మా, నీదు పాదముల వ్రాలి
లాలించవమ్మా రమ్యరూపిణి నీవు ||రా||

4 మా హారతందుమమ్మా మహాలక్ష్మీనీవు
దీవించవమ్మా, దివ్య తేజోరూపిణీ ||రా||

## పాట.34

పల్లవి గానమాలించి పాలింపవే నా . ||గా||

అనుపల్లవి కంచికామాక్షి మధుర మీనాక్షి
కాశి విశాలాక్షి నీలకంఠుని రాణీ ||గా||

చరణం 1 మంగళగౌరీ మాధవ సోదరీ
మహిషాసుర మర్ధనీ మంగళదాయనీ. ||మం||
మము కాపాడవే మాఇలవేల్పువై ||గా||

చరణం 2 నవరాత్రిలోనా నవరూపాలా
పూజలందెడి దుర్గవు నీవే
చల్లని నీచూపు - ప్రసరించు మావైపు ||చ||
నడింపిచు నా బ్రతుకు - నాతోడునీవై ||గా||

చరణం 3 జీవతమందున నటియించి నటియించీ
అలసితి తల్లీ నిను చేర వేడితీ
నీ దాపుచేర్చవే నీరజనేత్రీ
సౌందర్యరూపిణీ - సాంబశివుని రాణీ ||గా||

చరణం 4 కరుణించి కాపాడు కైలాస వాసినీ
శక్తి స్వరూపిణీ శాంభవి శంకరీ
పదదాసి పిలచేనూ పాలింపరావమ్మా
పచ్చల హరతీ గైకొనవమ్మా ॥గా॥

## పాట:35 (హరతిపాట)

పల్లవి హరతిగైకొనుమా శ్రీలలితే ॥హ॥

అనుపల్లవి హరతిగైకొనుమా ఆదిపరాశక్తి
దీవింపవే మమ్ము దీన బాంధవి నేడు ॥హ॥

చరణం 1 ముగురమ్మలకూ మూలము నీవమ్మా
కంచిలో వెలసిన కామాక్షి నీవమ్మా
మధురలో వెలసిన మీనాక్షి నీవమ్మా
మా పూజలనూ గైకోనవమ్మా ॥హ॥

చరణం 2 పచ్చల హరతి గైకొనవమ్మా గిరిరాజసుతే
కర్పురహరతి అందగ రావా
అమ్మల గన్న అమ్మవు నీవమ్మా ॥హ॥

చరణం 3. అభయమ్మునిచ్చే ఆర్తులబ్రోచే
చల్లని తల్లీ ఓభ్రమరాంబా ॥చ॥
పదదాసి పిలుపు వినిపింపలేదా
హరతి గొనుమా ఓ త్రిపురసుందరి ॥హ॥

## పాట.36 (ఝుమ్మంది నాదం వరుస)

హరినామ స్మరణం స్మరియించు నిరతం
ఘోరపాపాలు బాపూను
పరమపద మిచ్చి దరిచేర్చును ॥హరి॥

1 ఎదలోన నీవు హరిరూపు నిలుపు
అణువణువులోన హరినెపుడు చూడు
హరిపూజ చేసి తరియించు నీవు
వైకుంఠమును జేరుతావేపుడు వెతుకు
మృదు మధురమైన హరిపాదములను
పట్టేటి భాగ్యం నీవెపుడుకోరు ॥హరి॥

2 కమలాక్షునెపుడూ కనులందు నిలిపి
కరములు రెండూ జోడించి నీవు
అంజలి ఘటియించి హరివేడుఎపుడు
ఆనామమే నీకు చూపించు దారి
ఆనామమే నీకు శాంతిని కూర్చు ॥హరి॥

3 ఈ రూపు నీకు నిలిచేది కాదు
ఇహలోక సంపదా శాశ్వతముకాదు
పలికేటి వాడు పరమాత్మ వాడు
ఏరూపునైనా ధరియించి కదులు
భక్తులబ్రోవా కదిలెటివాడు
కనురెప్పలాగా కాపాడువాడు
ఆనామమే నీకు మధురాతి మధురం ॥హరి॥

## పాట.37 (ఏడుకొండలపైనా ఏల నిలచావోవరుస)

శేషాద్రి శిఖరాల ఏల నిలచావో
పిలచినా పలుకక ఎందుకున్నావో

1 వేడిన వారికి దరిశన మీయ
కదలవదేల అలుకింకేలా ॥శే॥

2 ఎంతగా వేడినా వినిపించ లేదా
మా తల్లితో నీవు దీవింప రావా
వేదన బాప వేగమె రావా ॥వే॥
మా వ్యధ బాప కదలపదేలా ॥శే॥

3 ఓ నీలవర్ణుడా వేదాంత వేద్యా
మనసార పిలువ జాగేలనయ్యా ॥ఓ॥
మనసుకు శాంతి ఈయవదేల ॥మ॥
పిలచీ పిలచీ అలసితినయ్యా ॥శే॥

## పాట.38 (చక్కనయ్యా చందమామా వరుస)

నల్లనయ్యా శ్రీనివాసా పలుక వేలయ్యా
నిన్ను నమ్మి కొలచినాము కావ రావయ్యా ॥న॥

1 నీదుస్మరణే చేసితీ మది నిన్ను చూడా వేడితీ ॥నీ॥
పద్మలోలా బ్రోవరావా కోపమేలయ్యా
పలుకరావయ్యా ॥న॥

2. కలియుగా వైకుంఠమనుచూ ప్రజలు నిన్ను చేరెదరే ॥క॥
కన్నులారా కరవుతీరా కానరావయ్యా.
గరుడవాహనుడా ॥న॥

3 స్వర్ణ శిఖరం నీనిలయం నీదు హృదయమె నవనీతం ॥స్వ॥
నాదు చింతలు బాప వేగ కదలవేలయ్యా
అలుక ఏలయ్యా ॥న॥

4 వడ్డికాసుల వాడవనుచు వడ్డీ వడ్డీ గుంజెదవే ॥వ॥
వేదవేద్యా శ్రీనివాసా నిలచి వున్నావా
తిరుమలాపైనా ॥న॥

5 మాదు వెతలన్ని తెల్పి నిన్ను శరణు వేడితి
మంగనాథా పాదదాసిని కావరావయ్యా
జాలమేలయ్యా ॥న॥

## పాట:39 (కళ్ళుతెరచి కనరా వరుస)

పల్లవి పాలకడలి శయన కృష్ణా
పాప నాశ హరణా రారా
నన్ను కరుణ చూడా ॥పా॥

చరణం 1 మీన రూపమును దాల్చినవాడా
వేదాలన్నీ కాచినవాడా
కూర్మరూపమున ఆగిరి మోసీ ॥కూ॥
అమృతమ్మునూ పంచిన వాడా ॥పా॥

చరణం 2 వరాహరూపా నారసింహుడా
వామనరూపా భృగురాముడవై
రాముడు నీవై - క్రిష్ణుడు నీవై ॥రా॥
బుద్ధుడు కల్కి నీవే కాదా ॥పా॥

చరణం 3. పార్థుని కీవూ రథసారథివై
జ్ఞాన భోధనూ చేసిన వాడా
నీవే దిక్కన నమ్మితినయ్యా ... ॥నీ॥
నారాయణుడా నన్ను బ్రోవరా..... ॥పా॥

చరణం. 4. మీరాబాయీ తుకారాముడూ
నిన్ను తలచీ ముక్తి నొందిరి
వారిబాటలో నేను నడువగా .... ॥వా॥
దీవింపుమురా దీనబాంధవా ॥పా॥

చరణం 5 మనసున స్థిరముగా నిను ధ్యానించి
పత్రము పుష్పము నీకర్పింపగా
నీడగ ఉంటానంటివి కాదా ॥నీ॥
ఈ శోధనలూ ఎన్నాళ్ళయ్యా . ॥పా॥

చరణం 6 ఘోర రక్కసు కూల్చినవాడా
ఘన విజయాలను పొందిన వాడా
నా అజ్ఞానము బాపగ నీకూ ॥నా॥
శక్తి చాలదా దామోదరుడా ॥పా॥

చరణం 7. మధుకైటభులను మర్ధించితివీ
నాలో మాయను బాపగ లేవా
సతతము నిన్నే స్మరించుచుంటి ॥స॥
నీదు దాసినీ బ్రోవగ రావా ॥పా॥

## పాట.40. (అన్నా అన్నా విన్నావా వరుస)

రమణా రమణా విన్నావా నాదూ
మొరలు విన్నావా కావ వేగమె వస్తావా
తరుణి మంగతో వస్తావా ॥ర॥

1 ఏడుకొండల వెంకటరమణా
దూరములోనా ఉంటిమయా
నిన్ను చేరగ లేమయ్యా
నీవే కావగ రావయ్యా ॥ర॥

2 బాలాజీని కాచుట కొరకై
ఏనుగు రూపము దాల్చావూ
మమ్మూ కావగ వస్తావా
నిజరూపము చూపిస్తావా ॥ర॥

3 భక్తులు అందరూ నిన్ను తలచి
వరములు అడిగి యున్నారూ
ఈయగ వేగమె వస్తావా
భక్తుల వరములు ఇస్తావా ॥ర॥

## పాట.41 (పలుకే బంగారమాయెరా వరుస)

కరుణా చూపవదేలరా శ్రీమంగ రమణా
కరుణా చూపవదేలరా శ్రీమంగ రమణా

1 ధరణి తిరుపతిలోనా వెలసిన రమణుడా
వరమూల నీయగా జాలమదేలరా ॥క॥

2. నీదు మహిమలు తెల్ప మావల్ల కాదయా
నీదు చల్లని చూపు మాపైన ప్రసరించు ॥క॥

3. అను దినమూ నీదు సేవ మరువాక చేయగా
వేదాంత వేద్యుడా పలుకావదేలరా ॥క॥

4 పట్టు పీతాంబరము కట్టితివయ్యా నీవు
నాల్గు చేతుల వాడా నీ దీవన ఈయవయ్యా ॥క॥

5 పద దాసినయ్యా నేను నాదూ వేదన బాపి
శేషాద్రి వాసుడా కదలీ రావయ్యా నీవు ॥క॥

## పాట.42

జననీ వరదాయనీ సరసిజనభ సోదరి భవానీ ॥జ॥

1 కృష్ణాతీరాన వెలసితివీవె ॥కృ॥
కనకదుర్గవై పూజలందగా ॥క॥
నిలచితివమ్మా గంగాతీరాన ॥ని॥
అన్నపూర్ణవై ఆదరించగా ॥జ॥

2 అఖిలాండేశ్వరి ఆదిపరాశక్తి
చాముండేశ్వరి శంకర ప్రియసఖి
వేడితినమ్మా మమ్మాదరించవే
నిరతము నిను కొలచు శక్తీయవమ్మా ॥జ॥

3 శ్రీశైల శిఖరాన వెలసితివమ్మా
భ్రమరాంబ రూపాన మా సేవలంద
ఏ పేరు పిలచినా పలికే తల్లివి
నీ వేను గావా ఓ జగన్మాతా ॥జ॥

4 ఆశ్వీజ మాసాన చేసితిమమ్మా
నవరాత్రి సేవలు నళినదళాక్షి
పదదాసినే నన్ను పాలింపవమ్మా
దయార్ద్రరాశివి నీవేనమ్మా ॥జ॥

## పాట.43 (రాగ తానం పల్లవి వరుస)

నామం ద్యానం చేయరా
ఆ హరినామమేవేళ తలవాలి నరుడా ॥నా॥

1 స్థిరము లేనిది మాయవంటిదీ ఈ లోకమే కనుగొనరా ॥నా॥

2 సంసారమనియేటి ఈ సాగరాన్ని
దాటాలి హరినామ మనియేటి నావలో ॥సం।
ఎన్నినామాలోను ఎన్ని రూపాలోను ॥ఎ॥
తెలియలేము హరిని ఈ జన్మలోనా ॥నా।

3 ఆతుకుల బొంతయె దేహమ్ము కాదా
కాష్టంలో బూడిదగా మిగిలేది కాదా
శ్రీ చరణ పద్మాలు నిరతమును తలవాలి

నిర్మల మనసుతో హరి రూపు చూడాలి
జన్మాంతరమున ||జ||
మోక్షమును పొందాలి
పదదాసులవ్వాలి పరమాత్మ చేరాలి ||నా||

## పాట.44

వేణుగోపాలా నీమేను నల్లనా
పండువెన్నెల్లా నీ మనసు చల్లనా ||వే||

1 కాళింది శిరముపై నటియించు నీ చరణం
కనుల కానందము కన్నయ్య నీరూపం
గోపాల బాలుడా గోకులా వాసుడా
గణనీయం నీనామం నవ్యాతి నవ్యం ||వే||

2 ఉచ్చింత కాయతో చద్దులే తిన్నావో
మనసునే మరపించు మురళినే ఊదేవో
మానసా చోరుడా మోహనా రూపుడా
మాధవా దేవుడా మాహృదయవాసుడా ||వే||

3 మన్ను తిన్నావనీ తల్లి యశోదడుగగా
ముల్లోకమ్ములు నీ నోటిలో చూపితివీ
మైమరచీ తిలకించగ మత్తునే చల్లితివీ
తనయుడవని మురిసిపోయి ముద్దాడే ఆ తల్లి ||వే||

4 యమునా తీరాన వేణువే ఊదావూ
ఆ రాధ దరిచేర రాసకేళిలో తేలితివో
ఈ రాధను మరచేవూ కదలి రాకున్నావు
నిను చూడక మనలేను నను వీడి పోబోకుమా ||వే||

**పాట.45**

మోహనాంగ రారా నవమోహనాంగ రారా
ముని ముని నగవుల మోమును చూపుచు
మురళిని ఊదుచు ముద్దుల కృష్ణా ॥మో॥

1 కస్తూరి తిలకము మోమున మెరయగ
కౌస్తుభంబు నీ వక్షము నమరగ
కాలి గజ్జెలు ఘల్లని మ్రోయగ
గజ్జెల మ్రోతకు నా యుల్లము ఝల్లన ॥మో॥

2. ధన ధాన్యములు అధికముకాదని
భక్తికి నీవు వశమౌతావనీ...
రుజువు చేశావు తులసి దళమునకు తూగిన నీవూ
తులా భారమున నీదు రూపము
కాంచగ నాకు కన్నులు చాలవు ॥మో॥

3 ఎర్రని పెదవుల వెదురు వేణువు
వదలక ఉన్నది ప్రతిక్షణమందు
నేనే వేణువై నీ కరమందున
నిలచి యుండగా వేడితి నిన్ను
ఈ రాధ పిలచేను యదువంశ తనయా ॥మో॥

**పాట.46** **(నామది నిన్ను పిలచింది గానమై వరుస)**

నామది నిన్ను కొలచేను మాధవా ఓ కేశవా, ఓకేశవా ॥నా॥

1 వైకుంఠము నీ నివాసమయ్యా
ఆ శేషువే నీపానుపు గాగా
శ్రీదేవి నీదు పాదములొత్తా ॥శ్రీ॥
లోకాలు పాలించు లోకేశ్వరా ॥నా॥

2. చితిలో కాలేను ఈ దేహమెపుడో
ఈ నిజము తెలిసేను నాకేమొ ఇపుడే
తలచేను నీ నామ మనుక్షణము నేను
కాపాడ రావయ్య కమలాక్షుడా

3 పుత్రులు-పౌత్రుల బంధాలు నన్ను
బంధించెనయ్యా నిను తలవనీకా
నీ కరుణతో నామది నిన్ను తలచే
వరమీయి రావయ్య విశ్వేశ్వరా ॥నా॥

4 వేదాలు వల్లించు ఆ మౌనులేను .
నీమాయ తెలియక నిలిచేరు స్వామి
నీ మాయ తెలియ నేనెంతదాన .
ఈ రాధ బ్రోవగ రావయ్యా ॥నా॥

## పాట.47 (జగదభి రాముడు శ్రీరాముడే వరుస)

అమృత ధారయె హరి నామమే
అద్భుత రూపము హరి రూపమే ॥అ॥

1 కరమున వేణువూ.. శిరమున పింఛము ॥క॥
పాదముల గజ్జెలు ఘల్లని మ్రోయ నడచేటి
శ్రీచిన్ని కృష్ణుని నామము ॥అ॥

2 కరముతో హరికి మ్రొక్కని నాడు
గళముతో హరినీ పిలువని నాడు ॥క॥
పదముతో హరినీ చేరనినాడు
ఈ జన్మ ఏలరా ఓ మానవుడా ॥అ॥

3 హరి హరి అని కరి మొరలిడగానే
సిరికిని చెప్పక కదలిన వానీ
కాకాసురునీ కాచిన వానీ
కైవల్య మిచ్చేటి సాకేత రాముని ॥అ॥

4 వాసుకి శయనుడు వారిజాక్షుడు
పరమ పురుషుడు పావన చరితుడు
ఈ రాధ పిలిచిన పలికేటి వానీ ॥అ॥

## పాట.48 (దేవదేవ ధవళాచలమందిర వరుస)

దేవదేవ శివశంకర దేవా శంభో హర హర నమోనమో
ప్రణవ స్వరూప కాశీ వాసా సాంబసదాశివ నమోనమో ॥దే॥

1 బ్రహ్మ విష్ణువులు పోరును సలుపగ అగ్నోద్భవ హర నమోనమో
కోటి సూర్యుల తేజ స్వరూపా లింగస్వరూపా నమో నమో ॥దే॥

2 స్ఫటిక లింగముగ నిను సేవింపగ సంపదలోసగే సదాశివా
జ్యోతిర్లింగా గౌరీ నాథా తాండవప్రియ హర నమోనమో ॥దే॥

3 భాద్రపదమాసాన భౌమవారమున క్షీరాన్నప్రియ నమోనమో
కార్తీక మాసాన అభిషేకప్రియ అభయప్రదాతా నమోనమో ॥దే॥

4 భక్తజన ప్రియ భోళాశంకర విభూతిధారి నమోనమో
పదదాసులను పాలింపగను కేదారేశ్వర నమో నమో ॥ప॥
నమో నమో నమో నమో నమో నమో ఓం నమో నమో ॥న॥
నాదప్రియ హర నమో నమో ॥న॥
పంచాక్షరముల తారకమంత్రము జపియించెద హర నమో నమో ॥దే॥

## పాట.49

ఎంతెంత ఫలమయ్య ఓ ఈశా
నిను పిలచి నిను తలచి కొలిచేటి వారికి ॥ఎం॥

1 శ్రీశైలవాసా భ్రమరాంబ సహితా మల్లన్నదేవా ఓ జంగమయ్యా ॥ఎం॥

2 కొండలను దాటి కోనలను దాటి నీ గిరిని చేరి
నిను సన్నుతించే నీ భక్త జనులకు ॥ఎం॥

3 పాతాళ గంగలో పాదాలు కడిగి పాహి పాహియని
నిను భజియించి నీ శిఖర దర్శనము చేసేటి వారికి ॥ఎం॥

4 శ్రీశైల శిఖరం దర్శించువారికి మరుజన్మ లేక కైవల్య మంద ॥ఎం॥

5 నీతో సమముగ పూజనందా శ్రీహరికి నీవూ వరమొసగితివి
బ్రహ్మ శిరమునే ఖండించ నెంచితివి
నీ లీల పాడగా నిన్ను సన్నుతింపగా
ఎవ్వరి తరమయ్యా ఓ లింగరూపా ॥ఎం॥

6 ప్రకృతి దృశ్యాలు పులకింప చేయగా
కనువిందు చేసేను నీ శిఖర దర్శనం
పాదదాసిగా నిను ఈ రాధ పిలచెనూ
పాలింప రావయ్య పార్వతీ నాథా ॥ఎం॥

## పాట.50

జోల పాడెదను నీకు ఓ పరంధామా
పవళింప రావయ్య ఓ నీలవర్ణా

1 అహంకార మనియేటి అరిటాకు తెచ్చి
కామక్రోధములనే నైవేద్యమిచ్చి
తామసమనే గుణమునే తీసి
తాంబూల మిచ్చేను రావయ్య స్వామి ॥జో॥

2. మమకారమనియేటి మల్లెలను తెచ్చి
మాలతీ జాజులతో పరుపునే వేసి
పవళింప రమ్మని నిన్ను పిలచేను
నేరము లెంచక నడచి రావయ్యా ॥జో॥

3. రావేల రావేల రాజీవ నేత్ర
రారమ్మని పిలవ దాగెదవు ఏల ॥జో॥

4 ఈ రాధ పిలచేను జోలపాడగను
పవళింప రావేల ఓ శ్రీనివాస ॥ప॥

## పాట.51 (తనువుకెన్ని గాయాలైనా వరుస)

తనువు లెన్ని మారినగానీ
ఆత్మ ఒక్కడే నరుడా
రూపమెంత మారినా దైవమొక్కడే నరుడా ॥త॥

1 భగవంతుడు ఆడుకొనే ఆటస్థలము ఈ జగతి
మనుషులనే బొమ్మలు చేసి దైవమాడు ఆట ఇదీ ॥త॥

2 ఏడి ఏడి దైవం అనుచు
యాత్రలెన్నో తిరుగానేల
అణువు అణువు దైవం ఉంటే ఎరుగ వేల ఓ మనసా ॥త॥

3 మానవుడై పుట్టిన నీవు
జన్మ విలువ తెలియగ లేక
మాయలోన మసలుతు ఉంటే మాధవునీ చూడగ లేవు ॥త॥

## పాట:52

అందాల హరి రూపు చూడాలిరా
హరి నామమే తలచి ఈ ఇహము మరవాలిరా ॥అం॥

1 ఏది ఏది నిత్యము ఏది కనిపించేది కలయే కాదా
సత్యము నెరిగి సర్వము మరచీ
శ్రీరామ నామము పాడాలిరా ॥అం॥

2 అ శాశ్వతము మానవ దేహము
మోహాల వలయము ఈ జీవితము
నాదీ నాదను భ్రాంతిని విడువరా
అందరిలోను పరామాత్మ చూడరా ॥అం॥

3 నారాయణా అని నరుడన్నాడా
నడచి వచ్చురా నారాయణుడే
వెన్నంటి వున్నాడు వెన్నల దొంగ
వేగమె వస్తాడు వేడాలి కాని ॥అం॥

## పాట:53 (సరిలేరు నీకెవ్వరూ వరుస)

భయమేది లేదింక శ్రీరామ నామము
తలచేటి వారికింక
రఘుకుల తిలకుని పూజించు వారికి ॥భ॥

1 పదములు శ్రీ పారిజాతాలుగా చేసి
మందార మల్లియల కుసుమాలు చేబూని
శ్రీరామచంద్రుని మనసార పూజించి
ఇహమును మరచిన ఈ లోకవాసులకి ॥భ॥

2 కరములతో కళ్యాణరామునికి మ్రొక్క
కనులార శ్రీరామచంద్రుని చూడంగ
నోరార ఆ రామచరితము పాడంగ
రామ రామయని రఘురామ తలప ॥ ॥

3 రామ రామ రఘురామ రామ రామ
వందనాయ సేతు బంధనాయ రామ
సీతామనోభిరామ శ్రీరామ చంద్ర రామ
రామా రామా .. రామా రామా. . ॥భ॥

## పాట:54 (చిరునవ్వుల తొలకరిలో వరుస)

చిరునవ్వుల శ్రీ లక్ష్మి మా ఇంటి మహలక్ష్మి
మా తల్లి మాలక్ష్మి మా ఇంటను నిలువమ్మా ॥చి॥

1 ఆ పాల సంద్రములోన ప్రభవించినావమ్మా
ఆ విష్ణుదేవుని నీవు చేపట్టినావమ్మా
మా పూజలే అందరావమ్మా
మా ఇంట నీవెపుడుండమ్మా
దీవింప నీవింక రావమ్మా
మా లక్ష్మి ఓ వరలక్ష్మి మము దయగనరావమ్మా ॥చి॥

2 మందార మాలికలల్లి వేశాను నీమెడలోనా
పసుపు కుంకాలతోటీ పూజలెన్నో చేశామమ్మ
మా పూజలందగ రావమ్మా మా ఇంట నీవెపుడుండమ్మా
మంగళహారతి గొనవమ్మా .
మా తల్లి మా జననీ మాహారతి గైకొనుమా ॥చి॥

3. ఆశ్వీజ మాసములోనా చేశాము నీ సేవలను
మహిషాసురమర్ధని నీవు ఆదిశక్తి నీవేనమ్మా
శుంభ నిశుంభుల దృంచితివే
మమ్ముల చల్లగ కాచితివే
మా ఇలవేల్పుగ నిలచితివే
ఓ అంబ మా జగదాంబ మా హారతి గైకొనుమా ॥చి॥

## పాట:55 (శివ శివ శంకర వరుస)

హరి హరి శ్రీహరి కేశవ మాధవ
నారాయణ హరి నమోనమో ॥హ॥

1 ఈ జన్మ విలువ తెలియని నేను
మోహాలందు చిక్కిన నేను ॥ఈ॥
ఏ వేళ చేయాలి నీ సేవలూ
ఏ లీల చేయాలి నీ సేవలూ ॥హ॥

2 వనమాలి నీవని ఏరేరి తేనా
నవ పారిజాతము నీపూజకూ ॥వ॥
శ్రీలక్ష్మి నీదు పాదములొత్త
నేనేమి చేయాలి నీ సేవలూ ॥హ॥

3 సనకాది మునులా ఏ జన్మ ఫలమో
నీ సేవ చేయ నిలిచారయా ॥స॥
మా అఘము లెల్ల వేగమె ద్రుంచి
నీ సేవ చేసె వరమీయవయ్యా ॥హ॥

**పాట:56** **(తెలిసిందిలే తెలిసిందిలే వరుస)**

కనుగొంటిలే కనుగొంటిలే
శ్రీహరిని నేడు కనుగొంటిలే ||క||

1 నవనీత హృదయంబు గలవాడులే
నవనీత చోరుడు అతడేనులే
పిలచానులే నే పిలచానులే కలలోన
కనిపించి మురిపించేలే - మురింపించెలే ||క||

2 కరిరాజు కాచిన కమనీయుడే
కనులందు కదలాడు కమలాక్షుడే
దరిచేర్చులే తన దరిచేర్చులే
నమ్మిన వారిని కరుణించులే, కరుణించులే ||క||

3 కంసుని చెరయందు జనియించెలే
నందుని గృహమందు ఎదిగేనులే
గోవిందుడే గోపాలుడే
గోపిక హృదయాలు దోచాడులే, దోచాడులే ||క||

4 కాళింది మడుగున చేరాడులే
కాళీయ గర్వము నణచాడులే ||కా||
శ్రీకృష్ణుడే బాల గోపాలుడే
ఆరూపు చూడంగ మనసౌనులే, మనసౌనులే ||క||

5 పదదాసి పిలువగ పలికేనులే
ఈ రాధ మదిలోను నిలవాలిలే ||ప||
విడబోకుమా నన్ను విడబోకుమా
శ్రీకృష్ణ నిను నేను నమ్మానులే, నమ్మానులే ||క||

## పాట:57 (చేతులెత్తి చెంతనిలచి వరుస)

చేతులెత్తి చెంతనిలచి పూజచేతు తల్లీ
పీటవేసి నిన్ను పిలచి కొలుచు కొందు తల్లీ
భూలోక వాసులకు వరములిచ్చు తల్లీ
మాతలకు మాతవని కొలుచు కొందుతల్లీ
శ్రీవరలక్ష్మి మా వరలక్ష్మి

1 ఇలయందు అష్టలక్ష్మి దేవాలయము
అది చూచువారి కన్నులకు భూతల స్వర్గం
సతతమును కాపాడు తల్లివి నీవే నిన్ను నమ్మువారి
ఆవేదన నీకు తెలియదా శ్రీ వరలక్ష్మి మావరలక్ష్మి ॥చే॥

2 గజలక్ష్మి వరలక్ష్మి ధాన్యలక్ష్మి వే
ఇంటింట వెలసి వున్న శ్రీలక్ష్మి వే
శ్రావణ మాసమందు కొలచేమమ్మా
మా పూజలంది నీవు మమ్ము దీవించమ్మా
శ్రీ వరలక్ష్మి మావరలక్ష్మి ॥చే॥

## పాట:58 (ఏమని వర్ణించను వరుస)

ఏమని వర్ణింతునూ
నాస్వామి రూపాన్ని శ్రీలక్ష్మినాధుని
ఆవెంకటేశునీ మాఇలవేల్పునీ ॥ఏ॥

1 వజ్రాల నగలెన్నొ ధరియించి వుంటాడు
వడ్డీకాసుల వాడు వర వెంకటేశుడు
ముడుపులు ఎన్నెన్నొ యిప్పించుకుంటాడు
కదలక ఆగిరిని వదలక వుంటాడు ॥ఏ॥

2 రాముడు వాడమ్మా రావణవైరుడై
కృష్ణుడు వాడమ్మా గోపికాలోలుడై
మన మేపేరు పిలచినా పలుకుతూ వుంటాడు
శ్రీగిరిపైనా కొలువై వున్నాడు ॥ఏ॥

3 అజ్ఞానములోన పడివున్న మాకు
ఆ జ్ఞానజ్యోతిని చూపించలేడా
ఆ దేవుడే మాకు అండగ లేకుంటే ॥ఆ॥
మనలేము మనము ఈ మాయాలోకాన ॥ఏ॥

4 మనసున్న వాడే మన వెంకటేశుడు
మనసార పిలువ మన్నించువాడే ఆ
ఆ దేవుడే మమ్ము కరుణించు వేళ
తన రూపు ఒకసారి చూపించలేడా ॥ఏ॥

## పాట:59 (చిరునవ్వుల తొలకరిలో వరుస)

శివకేశవ రూపముతో శ్రీహరి వెలసేవా
విశ్వేశ్వర నామముతో పూజలన్ని అందేనా
మా తండ్రి మహదేవ మము దయగన రావయ్యా ॥శి॥

1 ఆ గరిక పూవులు తెచ్చి పూజ చేసినామయ్యా
ఆ తమ్మిపూలు తెచ్చి సేవలెన్నో చేశామయ్యా ॥ఆ॥
మా తండ్రి నీవని నమ్మానూ
మామ్ముల బ్రోవగ పిలచానూ ..కావగ రమ్మని వేడానూ.
మా దేవ మహదేవ మా పూజలు గొనవయ్యా ॥శి॥

2 కార్తీక పున్నమినాడు పూజ చేసినామయ్యా
మారేడు దళములు తెచ్చి పూజించినామయ్యా
పళ్ళూ పాలను తెచ్చానూ అభిషేకములను చేశాను

మమ్ముల కావగ పిలచానూ .
ఓ దేవ మహదేవ మా హారతి గొనవయ్యా ॥శి॥

పాట:60 (ఆరనీకుమా ఈ దీపం వరుస)

మరువలేదురా నీస్మరణా మాధవా స్మరణా
చేరనీ నీ పాద పీఠం నా ఆత్మదీపం
నా హృదయమె నీ శేషతల్పం
నా మనసె నీ పూజ కుసుమం ॥మ॥

1 ఇంటిలోన మా ఇలవేలుపుగా శ్రీనివాసుని రూపం
కంటిపాపలో కదిలేవేళ కృష్ణయ్య రూపం
నామనస్సులో చేసే పూజ
నా మనుగడకే దారి చూపదా ॥మ॥

2. ఆకాశాన అంటే శిఖరం నేనెన్న డెక్కాలో
ఆకోనేట స్నానమాడి నాపాపాలెన్నడు కడగాలో
ఏమైనా ఎప్పుడైనా కోవెలలో కొలువైవున్న
శ్రీనివాసుని చూడాలో ॥మ॥

3 శ్రీనివాసుని చరణములే నే
శరణు శరణని వేడితినీ
పాదదాసినీ పాలింపమనీ
పరవత్మా నిను వేడితినీ
నా పలుకే నీ చరితమును
గానముగా నేపాడితినీ ॥మ॥

## పాట:61 (కరుణించు మేరిమాతా వరుస)

కరుణించు శ్రీనివాసా శరణింక శ్రీనివాసా నీవే శరణింక శ్రీనివాసా

1 నరజన్మ యిచ్చినావూ నీసేవ చేయనైతీ ॥న॥
స్థిరమైన జ్ఞానమిచ్చి దయతోడ బ్రోచు దేవా ॥న॥

2 మరణకాలమందు పలుకాడలేను స్వామీ ॥మ॥
కంఠాన కఫము చుట్ట నిన్నేల తలతుస్వామీ ॥క॥

3 అనుదినము నిన్ను కొలచు శక్తీయి స్వామీ నీవు
బ్రతుకంత భారమాయే . కరుణించి రావదేలా ॥క॥

4 దుర్లభంబు అయిన నరజన్మ యిచ్చినావు ॥దు॥
చంచలంబు అయిన మనసేల యిచ్చినావు ॥క॥

5 పద దాసినయ్య స్వామీ నీ సేవ చేయనైతీ
సుప్రభాత సేవా .. చేసేటి భాగ్యమీయి ॥క॥

## పాట:62 (ఏరాగమో ఇది ఏతాళమో వరుస)

ఏనామమో నీదేరూపమో
అని అన్నాను యిన్నాళ్ళు నే తెలియకా ॥ఏ॥

1 అణువణువులోనా అన్నిటిలోనా
నీవేను ఉన్నావులే నాకిపుడు తెలిసేనులే
ఈ మాయలోకాన నన్నుంచకు
నీపాద సన్నిధి నను చేర్చుకో
హరి హరి అని నిను పిలచే వేళ
నన్నింక వేధించకూ ॥న॥ ॥ఏ॥

2 తల్లివి నీవే తండ్రివి నీవే
నన్ముబ్రోచు ప్రభు వీవెలే ॥న॥

నీనామమునే స్మరియించు వారు
ధన్యత నొందారులే ॥ధ॥
నీ నామమే నాకు చుక్కానిగా
సంసారసాగరము దాటించులే
నీ నామస్మరణం చేసేటివేళ
నే నిన్ను చేరాలిలే ॥నే॥ ॥ఏ॥

3 అజ్ఞాన తిమిరం హరియింప చేయ
నిను నేను వేడానులే ॥ని॥
ఈ కనులతోటి నిను చూడలేను
నిను చూచు కనులీయుమా ॥ని॥
పదదాసినే నేను ప్రణమిల్లితీ
పాపాలు హరియింప హరి వేడితీ
మోహాలు బాప మోహన రూప
నే నిన్ను అర్థించితీ ॥నే॥ ॥ఏ॥

## పాట:63 (ఏమని పిలువనురా వరుస)

ఏమని వర్ణింతురా నిను నే ఏమని ఊహింతురా

1 రూపం లేని నామమును ఊరే లేని నీ సన్నిధినీ
ఎక్కడ వెతుకుదురా నిను నే ఏ విధి చేరెదరా ॥ఏ॥

2 అంతే లేని ఎన్నో జన్మలు అడుగడుగున ఈ మోహాలన్నీ
ఎన్నడు దాటుదురా నిను నే ఎన్నడు చేరెదరా
ఏ విధి కొలువనురా ॥ఏ॥

3 అందాలొలికే బృందావనిలో
గోపికలెల్లరు చేరేవేళ
మురళిని ఊదేవా నీవు రాధను మరచేవా
నీకై వేచితివా ॥ఏ॥

## పాట:64 (ఏతీగ పూవుకు ఏకొమ్మ తీగనో వరుస)

ఏ పూర్వపుణ్యమొ ఏ జన్మలోని వరమొ
ఈనాడు ఈమంచి నరజన్మ నెత్తి
తెలిసీ .. ఈ బంధమింకేలా

1 ఇహము మరువము పరము వెతకము ||ఇ||
ఈ మోహాలు నిత్యము కావు ||ఈ|| ||ఏ||

2 ఈ ఇహమంతా నాటకరంగం
ప్రతి జీవి ఒక పాత్ర రూపము ||ప్ర|| ||ఏ||

3 ప్రతి ఏడాది పెరిగామంచు
మురిసావెందుకు నిజము తెలియక
మృత్యువు నీకు దగ్గరయేరా
హరినామమును తలవవేలరా ||ఏ||

4 పుత్రులు ఎవరు పౌత్రులు ఎవరు
కడదాకా నీ కొచ్చేదెవరు ||క|| ||ఏ||

5 హరి నామమును మరువ వద్దురా
హరి చరణములు విడువ వద్దురా
అది ఒకటే నీ తోడు వచ్చురా ||అ|| ||ఏ||

## పాట:65 (ఈ రోజు అమ్మాయి పుట్టినరోజు వరుస)

ఈ రోజు కృష్ణయ్య పుట్టిన రోజు
ముక్కోటి ఆంధ్రులకు పండుగరోజు ||ఈ||

1. శ్రావణ మాసాన బహుళ అష్టమినాడు
కంసునీ చెరలోన పుట్టాడమ్మా ||ఈ||

2. నల్లని రూపువాడు శ్రీ కృష్ణుడు

నవనీత చోరుడు చిన్నికృష్ణుడు
మోహన రూపుడమ్మా గొపాలుడూ ॥ఈ॥

3 ఆ ఇంద్రుడు కోపించి రాళ్ళవాన కురిపింప
గోవర్ధన గిరినెత్తి కాచాడమ్మా ॥ఈ॥

4 బృందావనమున మురళీ ఊదాడమ్మా
గోపికల చిత్తాలను దోచాడమ్మా
రాసకేళిలో తాను తేలాడమ్మా ॥ఈ॥

5 కాళింది నదిలోన చేరాడమ్మా
కాళీయుని శిరమున ఆడాడమ్మా
తాండవా కృష్ణుడై నిలచాడమ్మా ॥ఈ॥

## పాట:66 (ఇక్ష్వాకుల తిలకా వరుస)

శ్రీ వెంకటేశుడా శేషాద్రివాసుడా శ్రీనివాసా
మమ్మేల రావయ్య మా కభయ మీయగా శ్రీనివాసా

1. దశకంఠు దునిమినా శ్రీరామచంద్రుడవే
రామచంద్రా ముని యాగము కాచీ
హరివిల్లు విరచీన రాఘవేంద్రా ॥శ్రీ॥

2 నీ గర్భగుడిలోనా ఆజ్యోతి కాంతులలో
శ్రీనివాసా నీ మూర్తి చూడగా
పాపము బాపును శ్రీనివాసా ॥శ్రీ॥

3 ఏడేడు శిఖరాలు నేనెక్కి రాలేను
శ్రీనివాసా భక్తుల బ్రోవగా
నీవే దిగి రావయ్యా ॥శ్రీ॥

## పాట:67 (కురిసింది వాన నాగుండెలోనా వరుస)

మనసార తలచీ మది నిన్ను నిలిపీ
వేడానురా స్వామీ .. ॥మ॥
కనుపింప రావా కరుణాల వాల ॥మ॥

1 వేమారు వేడా వేదాంత వేద్యా
నీ కరుణ చూపీ వ్యధలెల్ల బాపీ
మా అండగా రా..వా . ॥మ॥

2. వజ్ర కిరీటం శిరమందు మెరయ ॥వ॥
మా కండ్ల నిలచీ మము బ్రోచు భారం
నీవేనురా స్వామి .. ॥మ॥

3 మా దాపు చేరీ మా మనవి వినగా
పంతామదేలా.. నవనీత చోరా
శరణంటి నిన్నేరా . ॥మ॥

4 పదదాసి వేడ మనసార పిలువ
వరమీయ రావా వర వెంకటేశ
అలుకింక నీ కేలా ॥మ॥

## పాట:68 (మల్లెల కన్నా జాబిల్లి కన్నా వరుస)

పావన చరితా పద్మానాధా
పవళించు వేళాయె రావయ్యా నీకు ॥ప॥ ॥పా॥

1 నడిరేయిలో నీవు కదిలేవయ్యా
మంగమ్మనే నీవు చేరావయ్యా ॥న॥
మల్లెల పానుపు వేశామురా
అలివేలుతో నీవు శయనించరా ॥పా॥

2 నీ పాదమే నేను పట్టేనురా
వింజామరే నీకు వీచామురా ॥విం॥
ఓ శేషశయనా పిలచేనురా
మా స్వామి నీ వింక నిదురింపరా ॥పా॥

3 పదదాసి సేవలు గొనవేలరా
పవళింపు సేవలు చేశామురా
ఇద్దరు రాణుల మాస్వామి రావా
చల్లంగ శయనింప పాడానురా ॥పా॥

## పాట:69 (నీవుండే దా కొండపై వరుస)

ఇకనైన దయచూడవా శ్రీశా
నీవైనా కరుణింపవా
రావేరా మము బ్రోవగా .మాస్వామి ॥ఇ॥

1. మల్లీ మాలతి హరములు వేసీ
మనసార నిన్ను కొలచేము స్వామి
మోహనరూపా మమ్మేలరావా
మము బ్రోవ రావేలరా ..మాదేవా ॥ఇ॥

2 మదిలోనా బాధ వినలేవా స్వామి
శ్రీ శ్రీశా వేగ పలుకవదేమి
కమలాక్ష నీవు కదలీ రావదేలా
జాగేల చేసేవురా మా స్వామి ॥ఇ॥

3 పరిహాస మేమో మముబ్రోవనీకు॥ప॥
పదదాసి కావా పరుగున రావా
శేషాద్రివాసా సర్వేశా నీవు
సరగూన రావేలరా ఓస్వామీ ॥ఇ॥

పాట:70 (భలే మంచి రోజు వరుస)

మాలక్ష్మి రావే మహలక్ష్మి రావే
మా హరతందగా మాతల్లి రావే ॥మా॥

1 ఆదిశక్తి నీవేనమ్మా శంకరుని రాణివమ్మా
అపరంజి బొమ్మవు నీవే అందాలరాశివి నీవే
మా పూజలందీ హారతి గైకొనవమ్మా ॥మా॥

2 శ్రీహరికి రాణివి నీవే అమ్మలకు అమ్మవు నీవే
మా ఇంటి వేల్పువు నీవే మాయింటి లక్ష్మివి నీవే
మాహరతందీ దీవించ రావేమమ్మా ॥మా॥

3 నవ రాత్రులలోన నీకు సేవలెన్నో జరిగేనమ్మా
నిన్ను నమ్మువారికీ కంటిపాప నీవేనమ్మా
లోకమాత మాయింట నీవెపుడు ఉండాలమ్మా ॥మా॥

4. మంగళ గౌరివి నీవే శంకరుని సతివీ నీవే
గణపాతి తల్లివి.నీవే మాహరతందగా రావే
మా సేవలందీ నీవు దీవింప వేగమె రావె ॥మా॥

పాట:71 ( భలే మంచిరోజు వరుస)

రమణూని నామం మధురమైన నామం
ఎంత తలచినా గాని తనివి తీరనీ నామం ॥ర॥

1 కమలేశు నమ్మిన వాడు శ్రీశుని కొలచిన నాడు
ఎన్నెన్ని కష్టాలైనా పటాపంచలౌను సత్యం ॥క॥
సంసార సాగరమును దరిచేర్చునావే దైవం ॥ర॥

2 సృష్టిలోని ప్రతిఅణువూను నిండియున్న మాధవ రూపం
ఏ రూపమందైనా కనిపించు స్వామి రూపం ॥సృ॥
భక్తులను కాపాడుటకై ఏరూపమైనా దాల్చు ॥ర॥

3 వేదములను కాపాడుటకై మత్స్యావతారము దాల్చి
ప్రహ్లాదు బ్రోవగ నీవూ నరహరి రూపము దాల్చి ॥వే॥
కంసూని గర్వము నణచ కృష్ణావతారమె నీవు ॥ర॥

4 కలియుగమున భక్తుల బ్రోవ వెలసీతివయ్యా నీవు
తిరుపాతి కొండలపైనా స్థిరముగ నిలిచేవయ్యా
గోవింద నామముతో నీదు పదము చేరామయ్యా ॥ర॥

## పాట:72 (ఆశలు తీర్చవే ఓ జననీ వరుస)

జయ జయ హారతి శ్రీలక్ష్మి
మంగళ హారతి మహాలక్ష్మి ॥జ॥

1 త్రేతాయుగమున రామసతీ
ద్వాపర యుగమందు కృష్ణసతీ ॥త్రే॥
ఈ యుగమందున మంగాపురమున
వెలసితివమ్మా మా జననీ . ॥జ॥

2 జయలక్ష్మి నీకు హారతిదే
జయ జయహారతి గొనవమ్మా
కర్పూర హారతి కాంతా నీకు
గైకొనవమ్మా మాలక్ష్మి ॥జ॥

3. నీదు దాసులము మేమిలనూ
నీదు సేవలు చేశాము ॥నీ॥
పూజలు అందీ నిలవాలమ్మా
మా గృహమందున మహాలక్ష్మి ॥జ॥

4. పచ్చకర్పూరపు హారతిదే
పంకజాక్షి నీవు గైకొనుమా ॥ప॥
రమణుని గూడీ రాణీ నీవు
రంగుల హారతి గొనవమ్మా . . ॥జ॥

## పాట:73 (తిరుమల మందిర సుందర వరుస)

తిరుమల వాసా హరతీ
జయ జయ హరతి శ్రీపతీ
మా హరతిగొన నీవు రావయా
మా పూజలు గొనరా రమాపతీ ॥తి॥

1 సప్తగిరులపై సిరులతో నిలచే
మంగానాధా రావా మాపూజలను గైకొనరా
రావాస్వామి ఇక జాగేలా ॥తి॥

2 కాంతులు చిందే నీ రూపమునూ
కాంచగ నిను వేడితిరా
కాంతల తోను కానగరావా
కనుమరుగేలా కనరావా ॥తి॥

3. ఇలలో నీవు కలియుగ మందున
వెలసితివయ్యా స్వామీ
మా ఇలవేలుపు నీవేనయ్యా
ఇడుములు బాపా రావయ్యా ॥తి॥

## పాట:74 (రావేలా కరుణాల వాల వరుస)

పల్లవి జాగేలా శేషాద్రివాసా
కరుణను చూపగ రావేలా
అ॥ప॥ మునిజనపాల మురళీధరా రారా రారా శ్రీ శ్రీనివాసా
గోవిందా గోవిందా గోకులనందన గోవిందా ॥జా॥

చరణం. 1 స్థావర జంగమా రూపము నివే
సృష్టి స్థితి లయ కారణమీవే
ఏరీతిని నిను వర్ణింతునురా
దేవా రావా దీనదయాళో ॥గో॥ ॥జా॥

చరణం 2 అష్టవసువులు నీవే కావా
ఐరావతము నీవే కావా
విశ్వమంతా నీవే కావా
వినుతింతునురా విశ్వేశ్వరుడా ॥గో॥ ॥జా॥

చరణం 3 తేజోమూర్తి తిరుపతి వాసా
కాలస్వరూపా పుండరీక్షా
జగదోధారా ప్రణవ స్వరూపా
లక్ష్మీ రమణా నారద సన్నుత ॥ల॥
నీ స్మరణే నాకానందమురా
నా బ్రతుకే నీ నైవేద్యమురా
నా మనసే నీ హారతి కాగా ॥జా॥

## పాట:75 (నారాయణతే నమోనమో వరుస)

నారాయణ హరి నమో నమో
శ్రీ నరహరి రూపా నమో నమో

1 భవ భయ హరుడా పంకజనాభ
పాలింపుము మము పరమాత్మ
మంగళగిరిలో మానవుల బ్రోవగా
మహిమలు చూపిన మహనీయా ॥నా॥

2 జలనిధి శయనా దానవ భంజన
నళిన దళాక్ష నమో నమో
సింహచలమున చందన మలదిన
లక్ష్మీ నరహరి నమో నమో ॥నా॥

స్తంభము వెడలీ డింభకుగాచిన
కేశవ నామ నమో నమో
పరమ పురుష ఓపాప వినాశకా
ఓశేషశయనా నమో నమో ॥నా॥

## పాట:76

వందనం ఓ ఆంజనేయా వందనం శ్రీఆంజనేయా ॥వం॥

1 అంజనీ వరపుత్ర నీకు అంజలిదియే గొనవయా ॥వం॥

2 రామలక్ష్మణ రాక జూసి నీదు భుజముల వారినెత్తి
కిష్కింధకు చేర్చినావు సుగ్రీవుని కలిపినావు ॥వం॥

3 రామ చంద్రుని బాధ జూసి
సీత గురుతుల నగలు జూపి
సీత జాడను తెలుసుగొనగ
బయలు దేరితివి నీవు
లంక జేరితివి ॥వం॥

4 అశోక వనమున సీతను జూచి
రామ ముద్రికను యిచ్చావు
సీతాదేవి చూడామణిని
రామ చంద్రునికి చూపావు
వారధి దాటి రామచంద్రునితో
లంకను చేరావు
రామ రావణ సమరములోనా
రావణుద్రుంచారు
ఆ విభీషణుని రాజుగ జేసి సీతాదేవితో

అయోధ్య నగరం చేరావు
నీదు చరితను పాడినంతనే
భయము బాపావు
నీదు నామము తలచినంతనే
చెంత నిలచావు
రామ నామము ఎవరు తలచినా
నీవు అచటే వుంటావు
అభయ మిచ్చి పాదదాసుల ఆర్తిబాపావు ॥వం॥

## పాట:77

కృష్ణా యదుభూషణా కనరావా కమల నయనా ॥కృ॥

1 బోధించేవే విజయునకీవు గీతార్ధసారము రణరంగాన ॥కృ॥

2 అన్నీ నీవే అంతానీవే అని అన్ని మరచీ
నిన్నే తలచిన ఆర్తులకీవే ఆధారమయ్యా ॥కృ॥

3 చంపేదెవరు సమసేదెవరు
సర్వము నీవే అన్నావు కాదా ॥కృ॥

4 పుష్పము ఫలమూ ఏదైనానూ
నిశ్చల మనసుతో ఒసగేవారికి
నీడగ ఉంటాను అన్నావు కాదా ॥కృ॥

5 సుఖదుఃఖాలూ నీమాయేననీ
తెలిసీ నిన్నే పిలచేవారిని
సరగున కాపాడే పరమాత్మ నీవే ॥కృ॥

6. కానగ రావే దాసిని నేనూ
చేర్చగ రావే నీ దాస దాసిగ ॥కృ॥

**పాట:78** **(గోవిందు డొచ్చెనమ్మా వరుస)**

వరలక్ష్మీ వచ్చేనమ్మా వరమీయవచ్చేనమ్మా

అ॥ప వరలక్ష్మీ వచ్చేను వరమీయ వచ్చేనమ్మా
శ్రీలక్ష్మీ తానమ్మ సిరులిచ్చు తల్లమ్మ

1 శ్రావణా మాసాన పున్నమికి ముందుగా
శుక్రవారమునాడు సేవలను అందేను
పసుపు కుంకుమలిచ్చి ముమ్ములను బ్రోచేను ॥వ॥

2. సన్నజాజీ సిరులు తెచ్చి సరసిజాక్షి కిద్దాము
సంతాన లక్ష్మిగా సంతతిని యిచ్చేను
అష్టలక్ష్మిగా తాను అవతార మందేను
మా ఇంటి కొచ్చేను మహలక్ష్మిగా తాను ॥వ॥

3 నవ రుచులు భక్ష్యాల నైవేద్యమిద్దాము
ఊగీఫలముల తోటి తాంబూల మిద్దాము
నవగ్రంధి తోరణము నళినాక్షి కిద్దాము
కర్పూరహారతి కమలాక్షి కిద్దాము ॥వ॥

4 అపరాధములు కాచి ఐదవతనమిచ్చి
అదుకోరమ్మని అర్తితో పిలచినా
కమలభవుని రాణీ కదలి వచ్చేనమ్మ
పాదదాసుల బ్రోన పార్వతియే తానమ్మ ॥వ॥

## పాట:79

ప॥ అంబా భ్రమరాంబా ॥అం॥
మాపూజ లందగ రావమ్మ మాతల్లీ ॥అం॥

అ॥ప సాముహికముగా కోటి నామాలతో
కుంకుమ పూజలు అందగ రావమ్మ
రాజరాజేశ్వరి రామసహోదరి ॥రా॥
రావమ్మ రావమ్మ రాజీవనేత్రి ॥అం॥

1 ముగురమ్మలకే మూలము నీవు
మూకాంబికాపేరును పొందేవు
శుక్రవారమునాడు ముత్తయిదువుల
పూజలందగ రావే ఓ కాళికా ॥అం॥

2 రాశిరాశిగా కుంకుమ పూజలు
అందగ రావమ్మ అన్నపూర్ణగనీవు
సుదతులందరు నిన్ను సేవింపుచున్నారు
'సేవలందగ రావే కాత్యాయినీ ॥అం॥

3 పూమాల వేసాము పూబోణిరో నీకు
అరుణిమ దాల్చేను నీముఖ కమలము
గంధాక్షతల పసుపు కుంకుమల
పూజింప వచ్చాము శరణని వేడాము ॥అం॥

4 విశ్వవినోదనీ వైష్ణవీ మాతల్లీ
అంబుజ వాసినీ ఆశ్రిత పోషిణీ
వైదిక రూపిణీ మోక్షప్రదాయనీ
పదదాసి పిలచేను పాలింపవే ॥అం॥

## పాట:80

ప॥ ఆరగించ రావయ్యా ఆత్మబంధువా ॥ఆ॥

అ ప॥ ఆరగించు అరటి పండ్లు అందమైన ద్రాక్షపళ్ళు
తేనెతోడ చేర్చినట్టి తియ్యనయ్య సపోటాలు ॥ఆ॥

చరణం 1 నామనసే మందిరముగ మలచి నాను మాధవా
పంచప్రాణములు నీకు పుష్పముగా పూజచేసి
విందు కొరకు నిన్ను పిలచా
వెండి పళ్లెరములోన ॥ఆ॥

చరణం 2 కన్నులతో నిన్ను చూచి నన్నునేను మరచినాను
పిలుపు వినగరావయ్యా - ఆరగించిపోవయ్యా ॥ఆ॥

చరణం 3 కరములతో భజన చేసి - పిలచినాను నిన్ను నేను
పిలుపు వినగ రావయ్యా - ఆరగించి పోవయ్యా ॥ఆ॥

చరణం 4 అంధుడైన సూరదాసు - ఆత్మలోన నిన్ను చూసి
గానముతో నిన్ను పిలచె - ఆనాడు ఆదాసుడు
ఈ రాధ పిలచేనూ ఈనాడు రావయ్యా
నవనీత హృదయుడా - నవనీత మారగించ ॥ఆ॥

## పాట:81 (వెలుగు చూపవయ్యా వరుస)

ప॥ వెలుగు చూపవయ్యా మదిలో కలత బాపవయ్యా శ్రీ శా ॥వె॥

చరణం 1 నిరతము నిన్నే మదిలో నిలిపీ - నీనామమునే నిరతము తలచీ
నీ పదములనే శరణనివేడా ॥నీ॥
కదలవదేలా అలుకింకేలా ॥వె॥

చరణం 2 వేకువ ఝామునే చేసితి నీకై
ప్రభాత సేవా - ఓ జగదీశా ॥వె॥
మేలు కొనవయా - మంధర గిరి ధరా ॥వె॥
నడిపించు నా బ్రతుకు నాతోడు నీవై ॥వె॥

చరణం 3 మాయా జగతిలో మోహాలు ముసుగులో
చిక్కితినయ్యా ఓసర్వేశా
భ్రాంతిని బాపి బ్రోవగరావా ॥బ్రాం
కదలవ దేలా - అలుకింకేలా ॥వె॥

చరణం 4 పాదదాసినీ - పాలింపుమనీ
పలుమారు వేడినా - పలుకవ దేమీ
చేయూత నొసగి నీచెంతకుచేర్చ ॥చే॥
ఆదుకోవయా - ఆనందనిలయా ॥వె॥

## పాట:82 (ప్రైవేటు రికార్డు వరుస)

ప॥ ఏడుకొండల వాడా ఓవేంకటేశా
ఎడము చేయక మమ్ము ఆదుకోవయ్యా ॥ఏ॥

చరణం 1 మురికి కూపం బైన ఈ ఇహములోనా
పన్నీరుగా ఎంచి పడి ఉన్ననాకు
సత్యమేదో తెలుప నిన్ను పిలచేనయ్యా
నీరజాక్షా నన్ను నీడలా బ్రోవరా. ॥ఏ॥

చరణం 2 ఆపదలు బాపరా అచ్యుతా కేశవా
ఆనందరూపా ఆపదోద్ధారకా
అపరాధములు బాపి ఆశీర్వదించరా
శరణంటు వేడితిని శేషాద్రివాసా ॥ఏ॥

చరణం 3 ముదుపులను అందావూ
మూల పురుషుడా నీవూ
నిలువుదోపిడి ఆడిగి నిలచి ఉన్నావయ్యా
కమలనాభుడ నన్ను కాపాడరావయ్యా
యోచనేలర నీకు యాచించెదా నిన్ను ॥ఏ॥

చరణం 4 నిను చూడ వేడాను ఈ జన్మలోనా
మరుజన్మయే లేని పరమీయ వెడాను
ఏజన్మ పాపమో నిను చూడలేకుండ
ఈ జన్మ ఫలమేమో ముందుజన్మంపెమో ॥ఏ॥

## పాట:83 (ఏల ఈమానుష జన్మం వరుస)

ప॥ ఏటికి జన్మంబు - ఓ శ్రీనివాసా
నరజన్మనెత్తి నిను తలవలే కున్నాను ॥ఏ॥

చరణం 1 మరువనూ ఆహారం - మరువనీ మమకారం
మరచెదను నీనామ మొక్కటే శ్రీకృష్ణ
ఇదిఏమి నీ లీలా ఎరుగలేకున్నాను ॥ఏ॥

చరణం 2 విడిచెదను షట్కర్మలు విడిచెదను వైరాగ్యం
విడువనీ భోగాలు ఇది ఏమి నీ లీల
తెలుపరారా కృష్ణా ॥ఏ॥

చరణం 3 తగులు కొని విడువనీ బంధాల లంపటము
విడువనీ ఇహలోక బంధాలు శ్రీకృష్ణా
విడిచెదను నీ భజన ఇదిఏమి లీల
ఎరుగలేకున్నానూ నీమాయ శ్రీకృష్ణా ॥ఏ॥

చరణం 4 ఈ మాయ తొలగించి
మనసులో నిను నిలుపు
దారి చూపించరా ఓ విష్ణురూపా
పదదాసి పిలచేనూ కరుణింపరావయ్యా
ఈ జాగుఏలరా యదకు లానందవా ||ఏ||

## పాట:84

ప|| ఎక్కడ ఉన్నాడో ఏడుకొండలవాడు
ఏపేరు పిలచినా పలుకక ఉన్నాడు ||ఎ||

చరణం 1 కలియుగంబునా కన్నులవిందుగా
శేషాద్రి శిఖరాన సిరులొలుకు మోముతో
దరిశన మిచ్చేనూ ఆభక్త కోటికి
ఆర్తితో పిలచినా..ఆదమరపు ఏలనో ||ఎ||

చరణం 2 అణువు అణువునా అరుణాచలేశుడు
నిబిడీ కృతమై ఏవేల ఉన్నాడు
వేయిపేరులవాడు వృషభాచలేశుడు ||వే||
ఏభక్తుని హృదయానా బందీగా ఉన్నాడో ||ఏ||

చరణం 3 బాధితుడైనా బాలాజీ పిలువా
కరి రూపధారిమై కదలిన వాడు
ఏదారి కానక ఎలుగెత్తి పిలచానూ ||ఏదారి||
ఏలరాడో స్వామి ఏ రూపునైనా ||ఏ||

చరణం 4 పదదాసి పిలచేనూ పాలింపరావయ్యా
పంకజనయనా పన్నగశయనా
భక్తులపాలిట పెన్నిధినీవే . ||భ||
దరి చేర్చి నాకూ దారి చూపగరాదే . ||ఎ||

## పాట:85 (ప్రైవేటూరికార్డు పరుస)

ప॥ జయము శ్రీరఘురామ - జయము జగదభిరామ
జయము సీతారామ - జయము శ్రీరామ ॥జ॥

చరణం 1 కామక్రోధములు నను కాలువేసినవయ్యా
రక్షింపరావయ్యా - జానకీ రామా ॥జ॥

చరణం 2 లోభ మోహములలో చిక్కియుంటిని తండ్రి
ఈ చెరను బాపరా భద్రాద్రి రామా ॥జ॥

చరణం 3 నీసేవ చేసాను సిలమేమున్నాయా
నీ అండ చేరితిని ఓ పరంధామా ॥జ॥

చరణం 4 ఘోరపాపములు నే చేసియుంటి తండ్రి
నీ పేరు తలచి నే ధన్యుడనైతి ॥జ॥

చరణం 5 అలుక చాలును తండ్రి అయోధ్యరామా
ఆదుకో రావయ్యా అందాలరామా ॥జ॥

చరణం 6 కాకాసురుని బ్రోచి కీర్తిగాంచితివయ్యా
కొదండరామయ్యా కోటిదండాలు ॥జ॥

చరణం 7 ఆనాడు ఆరామ దాసుబ్రోచిన వాడా
పదదాసి బ్రోవగా జాగేలనయ్యా ॥జ॥

## పాట.86

ప॥ అంబ వందనం జగదాంబ వందనం
కంబు కంఠురాణి కల్యాణీ వందనం ॥అం॥

చరణం 1. నగుమోమూ రూపిణి రాజరాజేశ్వరి ||న||
రాకేందు వదన నిన్ను రారమ్మని పిలచి నీకు
పాదపూజ చేసి నన్ను పాలింపరమ్మనీ
నీపదములు శరణంటి శరణు శరణు శర్వాణీ ||అం||

చరణం 2 శ్రీ చక్రవాసినీ సాంబశివుని రాణివే ||శ్రీ||
నిష్క్రోధ క్రోధశమని నిర్లోభలోభనాశని ||అం||

చరణం 3 మహారూప మహా పూజ్య మహాపాప నాశనీ ||మ||
పద్మాసన భగవతీ పద్మనాభ సోదరీ
సువాసినీ పూజలంది ఓకోమాలాంగీ
నీవు దీవింపవే మమ్ము ఓంకార రూపిణీ . ||అం||

చరణం 4 కాత్యాయని కాలహంత్రి కర్పూరహారతిచ్చి ||కా||
నిన్ను వేడినానమ్మ కలుషనాశని రావమ్మ ||ని||
నీదాసిగ పిలచినాను - పూజలందరావమ్మా
మా ఇంటి వేల్పువై మమ్ము కాపాడవమ్మ ||అం||

## పాట:87 (ఓనమాలు నేర్పాలని వరుస)

ప|| ఓంకారశబ్ధానికి రూపం నీవమ్మా
ముజ్జగాల తల్లీ మూలపుటమ్మా ||ఓం||
అ.ప సో హం అంటూ నిన్నే ధ్యానముచేసారమ్మ
మునులెల్లా నిన్ను తలచి ముక్తిని పొందేరమ్మా ||ఓం||

చరణం 1 సౌందర్య రూపిణీ త్రిపుర సుందరి నీవే
మమ్ము కాపాడగా కాత్యాయనీవే ||సౌ||
కొలిచేటి వారికీ కొంగుబంగారమే ||కొ||
దుష్టులను శిక్షింప ఉగ్రరూపిణి వీవే ||ఓం||

చరణం 2 సింహవాహినివై నీవు కదలి రావమ్మా
రాజరాజేశ్వరీ రమ్యక వర్ధినీ
గంగాతీరాన నీవు శంకరునీ రాణివై. ॥గం॥
విశ్వమంత పాలించే విశాలాక్షీనీవే . ॥ఓం॥

చరణం 3 నవరాత్రిలో నీకూ నవరూప పూజలూ
చేసాము తల్లీ అందగా రావమ్మా ॥న॥
కర్పూర హారతీ ఇచ్చాముతల్లీ
దీవింపవే మమ్ము దీనబాంధవి నేడు ॥ఓం॥

## పాట:88 (కొండలలో నెలకొన్న వరుస)

ప॥ కొండపైన వెలసిన తల్లీ భ్రమరాంబా రావేవమ్మ
భయమును బాపగరావా రాజీవ నేత్రి రావా
రారమ్మని పిలువగ నేనూ యోచింప తగునా నీకూ ॥కొం॥

చరణం 1 శ్రీశైలవాసిని నీవే త్రినేత్రు రాణివి నీవే
శిరసొంచి నీపదములనే శరణంటూ వేడితినిన్నే
గాయత్రి సావిత్రనుచూ ముమ్మారు వేడితినిన్నే ॥కొం॥

చరణం 2 రమ్యమైన రూపిణి నీవే శక్తిస్వరూపిణి నీవే
అజ్ఞానతిమిరము బాపి జ్ఞానమొసగ రావేమమ్మా
అంధకార మందు మేమూ అలమటించు చున్నామమ్మా ॥కొం॥

చరణం 3 వందారు జన సందోహ వందితాయ వందనమమ్మా
అంతర్ముఖ జనానందా ఫలదాయ వందనమమ్మా
పాలింపరావే మమ్మా పరమేశు రాణివమ్మా ॥కొం॥

చరణం 4 శ్రీనాధ సోదరి భూతా శోభితాయ వందనమమ్మా
చంద్రశేఖర భక్తార్తి భంజనీ వందనమమ్మా
వైష్ణవీ దుర్గవునీవే హరతందగా రావేమమ్మా .. ॥కొం॥

## పాట:89 (పగడపు చనముల వరుస)

ప॥ శ్రీలలితా నీకు హారతి గైకొనవమ్మా పార్వతీ
ముదముతో సుదతుల పూజలు అందీ
దీవింపవమ్మా మహేశ్వరీ ॥శ్రీ॥

చరణం 1 జటా ఝూటమున గంగను నిలపిన
శశిధర రాణివి నీ వమ్మా
పదములు గజ్జెలు ఘల్లని మ్రోయగ
అడుగిడి మా ఇంట నిలువమ్మా ॥శ్రీ॥

చరణం 2 ముగురమ్మలకూ మూలము నీవే
ఆది పరాశక్తి రావమ్మా
ముక్కోటి జనులకు మాత్రుమూర్తివి
మా సేవలను గైకొనుమా ॥శ్రీ॥

చరణం 3 అర్ధనారీశ్వరి అన్నపూర్ణవీ
శాంభవి భైరవి త్రిపుర సుందరీ
మల్లీ మాలతి మందారమ్ముల
పూజలు గొనగా రావమ్మా ॥శ్రీ॥

చరణం 4 రాజరాజేశ్వరి రామసహోదరి
సుందర రూపిణి శ్రీశైలవాసిని
పద దాసి పిలచేనూ పరమేశు రాణీ
హారతి అందీ దీవించవమ్మా ॥శ్రీ॥

పాట:90 (ముసిముసి నవ్వుల వరుస)

మునిజనవందిత శ్రీశా మోక్షంబీయగ రావా ॥ము॥
ఏపేరు పిలచినా, ఏరూపు కొలిచినా
అభయమ్మునిచ్చువాడు శ్రీశుడొక్కడే ఆఈశుడొక్కడే ॥ము॥

చరణం 1 ఆరేళ్ళధ్రువుడి కోసం
ఆనాడు కదలినా
అవమానమంది పిలవా
అభయమ్మునిచ్చినా శ్రీశుడొక్కడే ఆఈశుడొక్కడే ॥ము॥

చరణం 2 శరణన్న శత్రువైనా
చేయూతనిచ్చినా
వృషభాద్రి పైన నిలచి
నీలాలు అందినా శ్రీశుడొక్కడే ఆ ఈశుడొక్కడే ॥ము॥

చరణం 3 అనురాగ మోహబంధం
హృదయాన కదలినా
తనవారుతోడు రాక
కదలేటి వేళ అయినా శ్రీశుడొక్కడే ఆ ఈశుడొక్కడే ॥ము॥

చరణం 4 నిజమేదో తెలిసి నీవు
శరణన్న వేళయైనా
కవిరాజు రూపమంది
కదలేటి వాడు అయినా శ్రీశుడొక్కడే ఆ ఈశుడొక్కడే ॥ము॥

చరణం 5 పాపాల తోడి బ్రతుకు ఏదరికి చేర్చినా
గతితప్పిన జీవితం శృతిలేని రాగమైనా
జీవాల శృతిని మీటి రాగాన్ని ఇచ్చినా
సంసార సాగరాన్ని దాటించు నావ అయినా
శ్రీ శుడొక్కడే ఆ ఈశుడొక్కడే ॥ము॥

**పాట:91** **(నీలాల నింగిలో వరుస)**

పల్లవి ఆ కొండ కోనలో ఆజ్యోతి రూపుతో
నా కళ్ళలో నిలిచిపోవా
నీకై నడచిరామా నీలో కలిసి పోమా ॥ఆకొండ॥

చరణం 1. కరిమల వాసివి నీవై ఆజ్యోతి స్వరూపుడ నీవై
అన్ని రూపములు నీవేయని అందరి కండనీవేయని
హరి హరరూపుల తనయుడవై మణికంఠునిగా పేరొంది
ఇరుముడి, ముడుపుల, ఇరుముడి ముడుపుల తలపై యిడి
నీకై నడిచిరామా .. నిన్నే చేరుకోమా ॥ఆ కొండ॥

2. నీచరితములే విన్నాము నీ కొండకే రానున్నాము
ఒక్కపొద్దులే ఉన్నాము వక్ర బుద్ధులేమానాము
నల్లని వస్త్రం ధరియించి, మోహం,లోభం వదులుకొని
మండల దీక్షను, మండల,దీక్షతో మాలను వేసి
నీకైనడచి రామా. నిన్నే చేరు కోమా ॥ఆ కొండ॥

3. అకానలో కదిలాము, నీకరిమలనే చేరాము
శరణం,శరణం, అన్నాము, స్వామి శరణం అన్నాము
పంపానదిని చేరుకుని, పాపాలన్నీ మాపుకొని ॥పం॥
త్వరపడి,పరుగిడి, త్వరపడి,పరుగిడి పదునెనిమిది మెట్లెక్కి
నీకై నడచి రామా నిన్నే చేరుకోమా ॥ఆ కొండ॥

4 నీ మోహన రూపము చూసి మామేనులనే మరిచాము
గోక్షీరాలే యిచ్చాము అభిషేకాలే చేసాము
శరణం, శరణం, అయ్యప్ప స్వామి శరణం అయ్యప్ప ॥శ॥
భక్తితో భక్తులు, భక్తితో భక్తులు భజనలు చేసి
నీకై నడచి రాగా నీవే కదలి రావా ॥ఆకొండ॥

## పాట:92

దయగనవయ్యా ,లక్ష్మీనరహరి
దరిశనమీయరా - గిరిపై కేసరీ ॥ద॥

1 మా ఇలవేల్పువు నీవంటినిరా
భక్తులఁబ్రోచే భక్తవరదా
ప్రహ్లాదు బ్రోచిన - నరసింహరూప
ఆదుకోవయా, అభయప్రదాతా ॥ద॥

2 అన్ని రూపములు,నీవేనంటినిరా
ఆది మధ్యాంత రహితుడ వంటినిరా
ఇహమూ, అహమూ,అన్నిమరచీ
నీదరిచేర్చరా ఆది పురుష నను ॥ద॥

3 మంగళగిరిలో వెలసిన స్వామి
మంగళహారతి అందగ రారా
మామదిలో నిను నిరతము కొలచీ
శరణంటిమిరా సారసాక్ష నిను ॥ద॥

## పాట:93

వినవా నామొర వెంకటేశుడా
వినిపించలేదా నీకు విన్నపాలు నే తెలుపా ॥వి॥

చరణం 1 దీపము వెలిగించ నీకు,తైలమైనా లేనిదాన్ని
పాదపూజచేయనీకు పుష్పమైన లేనిదాన్ని ॥దీ॥
కన్నీట నీదు పదము,కడిగెదనయ్య స్వామీ .
పన్నీరుగా ఎంచి, పలుక రావదేమి స్వామి ॥వి॥

2 నడచి వచ్చి నీదు కొండ ఎక్కలేని దాన్ని స్వామి
గుండె గుడిగా చేసి నిన్ను ,కొలచు చుంటిస్వామి నిన్నే
గానముతో నిన్ను పిలువ, మూగవోయ నాదు గళము,
మనసారా నిన్నుపిలవ మౌనమేలనయ్య స్వామి ॥వి॥

3 కమ్ముకొన్న కంటిపొరలు తొలగ వేయి స్వామి నీవు
కన్నులార నిన్ను చూడ వేచి ఉన్నదాన్ని స్వామి
భక్తవరదా భయము బాపి. ఈ రాధను బ్రోవ రావా
వదలనయ్య నీదు చరణం,అభయమిచ్చు వరకు స్వామి ॥వి॥

## పాట:94

ఏలనో ఈ నిదురా
ఏడు కొండల వాడా
కనువిప్పి లేవయ్యా - కమలాననా ॥ఏ॥

1 ఏడేడులోకాలూ పాలించి
అలసేవు, శేషపాన్నుపైన
పవళించి ఉన్నావో, వే వేగలేవయ్యా
శ్రీనివాసా ॥ఏ॥

2 విప్రవరులొచ్చారు
వేదాలు వల్లింప
వేగ లేవయ్య ఓ వెంకటేశా ॥ఏ॥

3 సప్తగిరి శిఖరానా
బంగారు ఊయలలో
పట్టు పానుపు పైన పవళించి ఉన్నావో
భక్తజనులొచ్చారు, నిన్ను సేవింపగా
కనుపింప రావయ్య కమలాక్ష నీవు ॥ఏ॥

4 ఈ రాధ పిలచేను
సుప్రభాతముచేత
సుమమాల వేసేను, నిన్ను పూజింప
వేవేగ లేవయ్యా ఏడుకొండల వాడా ||ఎ||

## పాట:95

విన్నవించవా ఓ వాయునందనా
పిలచి పిలచి నే వేసారితినని, శ్రీరఘురాముని
కర్ణములకు ||వి||

1 బందీనైతిని సంసారంలో
దాటగలేకా - నీదరిచేరితి
అభయము నొసగీ ఆదుకోమనీ
తెలుపగరాదా, నీరామునీకీ ||వి||

2 అంబరీషునీ, ఆర్తిని బాపా
దశరూపముల శాపము నొంది
ఆర్తుల పాలిట, ఆశాదీపమై
వెలపిన శ్రీరఘురాముని, సన్నిధిని ||వి||

3 పాదదాసిని పాలింపుమనీ
పరిపరివిధముల పిలచినగానీ
పలుకక ఉన్నా, సీతారాముని కర్ణములకు ||వి||

## పాట:96

పల్లవి హృదయమే నీ ఆలయందేవా
కనిపింపవా - ఓ కరుణాకరా
కమనీయం నీరూపు - కైవల్య మీవా ॥హృద॥

చరణం 1 రాముడు నీవే - కృష్ణుడు నీవే
ఏరూపైనా - ఏ పేరైనా
నీవేనయ్య ఓ దేవా
మానసపూజా - అందగరావా
ఓజగదిశా - రావయ్యా ॥హృద॥

చరణం 2 సూర్యచంద్రులే - నీ కన్నులుగా
సుందర రూపా - ఓ శ్రీనివాసా
పాపపుణ్యములా - సాక్షివి నీవే
నీవే లేని - తావే లేదూ
దర్శనమీయవా - దరహాసా ॥హృద॥

చరణం 3 కొండల పైనా - కొలువై ఉన్నా
కోనేటి రాయా - ఓ వెంకటేశా
ముడుపులు అందీ - ముప్పులు బాపే
మూలపురుషుడా - ఓ శ్రీశా
వ్యామోహాలు - వదలి రమ్మని
కురులు ముడుపుగా కోరావయ్యా
శేషాద్రి వాసా - ఓ శేషశయనా
భక్తులబ్రోవ - రావయ్యా ॥హృద॥

## పాట:97 (హిమముకురిసేవేళ వరుస)

పల్లవి భానుడొచ్చేవేళా - వెలుగు నింపేవేళా
పూజింతు రావయ్యా - వేణుగోపాలా ||భా||

చరణం 1 అసురులను ద్రుంచేవొ - అలసి నిదురించావు
పన్నీరు జలములను - తెచ్చినామయ్యా
జలకమాడగరారా - జలజాసన వినుతా ||భా||

చరణం 2 పట్టు వస్త్రము తెచ్చి - పరవశించామయ్యా
కస్తూరి తిలకమును -నుదుట దిద్దాలయ్యా
వే వేగరావయ్యా - నవనీతచోరా ||భా||

చరణం 3 విరబూసె మల్లియలు - వికసించె విరజాజులు
ఆ పూలమాలలతో - అర్చించ వచ్చాము
మాసేవలందరా - గోపాలబాలా ||భా||

## పాట:98

పల్లవి గోవిందా,గోపాలా, గోవర్ధనా
జనులెల్ల వినుతించు జనార్ధనా ||గో||

చరణం 1 వనమాలి దయామాని ఉన్నావయా
వరదాయకా ఓశుభదాయకా ||గో||

చరణం 2 మునులెల్ల మురవైరి అనిపిలువగా
మురిశావయ్యా - నీవు పలికేవయ్యా ||గో||

చరణం 3 వామనా, శ్రీధరా, మధుశూధనా
నారాయణా ఓ నళినాక్షుడా ||గో||

చరణం 4 సంసారబంధాలు - వేదించెరా
అవి ఛేదించరా - నీదరిచేర్చరా ॥గో॥

చరణం 5 సురలోక సంపూజ్య - వరదాయకా
నుతియింతురా - నినుబజియింతురా ॥గో॥

చరణం 6 ముల్లోక పూజిత దామోదరా
ఈ పాదదాసిని బ్రోవ జాగేలరా ॥గో॥

## పాట:99

పల్లవి వందనం వందనం చెన్నకేశవా
చల్లగా దీవించు పిల్లగోవిందా

అ ప॥ జీవాత్మ చేరాలి పరమాత్మలోన
అందుకే చేయాలి నీనామ స్మరణా ॥వం॥

చరణం 1 మనసు స్థిరము చేయా కొలవాలి హరిరూపం
ధ్యానించి చూడాలి హృదయాన ఆరూపం
మనసులోనే పరమాత్మను తెలియాలి ఇకనైనా ॥వం॥

చరణం 2 ఇహలోక బంధాలు విడరాదు అన్నావు
ప్రతి సేవా నీసేవగ భావించమన్నావు
నీలీల తెలియలేనూ నిన్ను చేరగలేను స్వామి ॥వం॥

చరణం 3 క్షేత్రయ్య పదములకు దివిని విడచి భువికి వచ్చి
కవితలను అల్లినావు అందాల క్రిష్ణయ్య
నిన్ను చేరదారి చూపి నన్ను కనికరించవయ్యా ॥వం॥

చరణం 4 శివకేశవులొకటనచు నిన్ను ప్రార్థించగా
గానలోల రావయ్య ఈ రాధ పిలచేనయ్య
ఇందిరా రమణ నిన్ను సన్నుతింతు రావయ్య ॥వం॥

**పాట:100** **(నన్ను విడచి నీవు పోలేవులే వరుస)**

పల్లవి ఎఱ్ఱనైన సూర్యకాంతి జగమెల్ల నిండగా
నిద్ర లేచిరావయ్యా నందనందనా క్రిష్ణా ॥ఎ॥

అ ప॥ నీమాయలో చిక్కి కదల లేక ఉంటిమిరా
మాయ అనే తెరను తీసి నిన్ను చేరనియవయ్యా ॥ఎ॥

చరణం 1 పూతనాది రక్కసులను కూల్చి ఘనము కాచియ్యా
నాలోని అహమునూ కూల్చగ రావయ్యా
కాళీయుని గర్వమును అణచగా సరిపొదు
నాలోని మోహాలు బాపగా రావయ్యా ॥ఎ॥

చరణం 2 నీలమేఘ శ్యామ నీవు శిరమందు పింఛము
కరమందు వేణువుతో బృందావని చేరావ్వ
రాసకేళిలోన తేలి నీభక్తుల మరువనేల
మాలోని రక్కసులను కూల్చగా రావయ్యా ॥ఎ॥

చరణం 3 ఎన్ని జన్మలైనవో ఇంకెన్ని జన్మలున్నవో
ముందుజన్మ ఏరూపు నాకు రానున్నదో
ఈజన్మలో నిన్ను తెలిసి నిన్ను చేర తలచితిరా
ఈ రాధ పిలచెనయ్యా కరుణించిరావయ్యా ॥ఎ॥

**పాట:101**

పల్లవి భద్రాద్రి రామయ్య మముబ్రోవ రావయ్య
మా తండ్రి నీవయ్య అభయమియ్య రావయ్య ॥భ॥

చరణం 1 గోదారి తీరాన గుడిన్ని కట్టిన
తలయాన వెలసిన ఆనందరామా
మాతల్లి సితతో కొలువున్న రామయ్యా
ని చరణం శరణంటిని శరణు శరణు ఓరామా ॥భ॥

చరణం 2 చింతాకు పతకమ్ము కంఠాన మెరయంగ
నీ రూపు చూడగా కనులు చాలవమ్మ
చింతబాప రావమ్మ జనక రాజ పుత్రీ
శిరంసొంచి వందనమూ మా తల్లీ సీతమ్మ ॥భ॥

చరణం 3 సౌమిత్రి సేవచేయా హనుమన్న వినయమున్నట్టు
కొలువున్న మా తండ్రి కౌసల్య నందనా
ఈ రాధ పిలచెనూ కనులారా నిన్నుచూడా
కనిపించు రావయ్య కల్యాణ రామయ్య ॥భ॥

## పాట:102 ("శివ శివ శంకర " వరుస)

పల్లవి హర హర శంకర శంభో శంకర, గిరిజా రమణా నమోనమో

అ ॥ప॥ ఢమరుక ధారీ నాగాభరణా, నందివాహనా ఓ మహాదేవా
తాండవ ప్రియ హర త్రిశూల పాణి భవ జనపావన లోకేశా ॥హ॥

చరణం 1 నటరాజు నీవని నినుకొలిచేరా అఖిల జీవులు నీపూజకు
కాశీలోనా కొలువున్నావు
ఆ అన్నపూర్ణతో నివాసముగా . ॥హ॥

చరణం 2 శివకేశవులు నీవేయనుచూ పదమున శిరమిడి మ్రొక్కితినయ్యా
మా హారతి గైకొనవయ్యా
ఈ రాధ పిలచెను పార్వతి నాథ ॥హ॥

చరణం 3 శ్రీ శైలావాసా భ్రమరాంబ సహితా
మల్లన్నదేవా వందనమయ్యా
అర్థశరీరమున ఆ గౌరి నిలువగ
అర్థనారీశ్వర నమో నమో ॥హ॥

చరణం 4 ఉసిరికాయలు తెచ్చి ఉమామహేశ్వరా
హారతి ఇచ్చాను అందగ రావయ్య ॥ఉ॥
ఈ రాధ పిలచేను ఈశా పరమేశా
పాలింపరావయ్య్య పతిత పావన నీవు ॥హ॥

## పాట:103

మ్రోగింపుమా మురళీ మ్రోగింపుమా
ముజ్జగాలు మోహింపగ మోహన క్రిష్ణా ॥మ్రో॥

చరణం 1 నీ మురళీ రవళి వినీ మునిపత్నులు కదలివచ్చి
సంసారమే మరచీ మైమరచీ ఉన్నారూ
ఒక్కసారి మురళి వినగ నే వేచి ఉన్నానూ
దయ చూప రావయ్యా వేణుగోపాల నీవు ॥మ్రో॥

చరణం 2 యమునా తీరానా వేణువే ఊదావొ
గోపికలు దరిచేరా రాసకేళిలో తేలావో
అంత వరము కోరలేదు ఓ చిన్ని కృష్ణయ్యా
ఒక్క క్షణం నీ గానం వినగోరి వేడితిని ॥మ్రో॥

చరణం 3 అటుకులిచ్చి మెప్పింపగ చెలికాడ కానైతీ
నవనీత మివ్వ సేను గోపికను కానైతీ
తులసీదళ మిచ్చి నేనూ నిన్ను పిలచినాను కృష్ణ ॥మ్రో॥

చరణం 4 సంసారమందు నేను బందీనై ఉన్నాను
బంధాలను త్రెంచలేక అలసి ఉన్నానయ్యా
ఈ బంధం త్రెంచి నన్ను నీ దరికి చేర్చరావా
నీగానం వినిపించి నన్ను కరుణ చూడ రావా ॥మ్రో॥

చరణం 5 ఎన్నాళ్ళు వేచేను నీ రాక కొసము
కళ్ళు కాయలు కాచే కన్నయ్యా రావేలా
నాదు కన్నీరు తుడచి కనిపింప రావయ్యా
ఈ రాధ పిలచెను ఆ రాధను విడచి రావా ॥మో॥

## పాట:104

శిరసొంచి వందనము ఓ శంకరా ॥శి॥
అసుర భయంకరా ఆశ్రితపోషా శంభోశంకర్గా మహదేవా ॥శి॥

చరణం 1 జటా జూటమున శశిని ధరించిన, సాంబసదాశివా సేవలందగ రావా
ఏకాగ్రతతో ఏకాంబరేశ్వరా ॥ఏ॥
కోరి కొలచితిని నిన్ను కైలాసవాసా ॥శి॥

చరణం 2 భస్మ ధూళిత దేవా పాపనాశకా, నాగా భరణా నారద సన్నుతా॥నా॥
నటరాజ నిన్నే నమ్మితినయ్యా, కావగరావా పరమేశా ॥శి॥

చరణం 3 మాసము లందునా కార్తీకమాసమ్ము నీకు
ప్రీతియని ఎంచి గోక్షీరమును తెచ్చి
అభిషేక మొనరించి అర్చనలు చేశాను
అభయ మియ్యగ రావా విశ్వేశ్వరా ॥శి॥

## పాట:105

పల్లవి అర్చించెదా నిన్ను లక్ష్మి నరహరి
పాలింప రావయ్యా ప్రహ్లాద వరదా నన్ను ॥అ॥

చరణం 1. సింహాచల వాసా మోము సింగమువాడా
మునిజన వందితా వందనమంటిరా
నరహరి రూపా ఆదినారాయణా
అభయము నీయరా భక్త వరద రావా ॥అ॥

చరణం 2 కరములు చాచీ యాచనచేయగా
యోచన చేయక కాపాడుము స్వామి
యాదాద్రి వాసా ఆదుకొరావయ్యా
మా ఇలవేల్పుగా కొలచితి నిన్నేనయ్యా ||అ||

చరణం 3 స్తంబము వెడలి డింభకు కాచిన
ఉగ్ర స్వరూపా ఓ నారసింహ
భక్తవరులు నిను స్తోత్రము చేయగా
దీవెన లిచ్చిన ఓ దీనబాంధవా ||అ||

చరణం 4 వడపప్పు పానకము నీకు ప్రియమని ఎంచి ||వ||
నైవేద్య మర్పింప నేతెచ్చినానయ్యా
ఈ రాధ పిలచెను సేవలందగ నిన్ను
సరగున రావయ్య సరసిజనాభ నీవు ||అ||

## పాట:106

పల్లవి హారతి గై కొనుమా శ్రీ సాయినాధ ||హా||

అ ప|| హారతి గై కొను షిరిడీవాసా
మా పూజలందుము శాంత స్వరూపా ||హా||

చరణం 1 అనుక్షణము నీ నామముతలచీ
నీపాదములనే శరణని వేడితి
గణపతిరూపా సద్గురు నాధా
హారతిగై కొను శ్రీ సాయినాధ ||హా||

చరణం 2 ఇడుములు బాపగా వేడితినియ్యా
సమాధినుండి జవాబు నిచ్చి

మమ్ము బ్రోవరా ఓ సాయినాథ ॥హో॥

చరణం 3 సంసార బంధము వీడగ లేను
నీ సన్నిధి నే చేరగ లేను
నీదరి చేరగ వేచిన నన్ను
దయను చూడుమా ఓ సాయినాథ ॥హో॥

చరణం 4 కర్పూర హారతి అందగ రారా
పచ్చల హారతి అందగరారా
ఈ రాధ పిలచేను నీ సేవచేయ
జాలము చేయక కదలి రావయ్యా సాయి ॥హో॥

## పాట:107 (వేణువై వచ్చాను భువనానికి వరుస)

పల్లవి మనిషినై పుట్టాను భువనాన నేను
ఏరీతి చేరాలి పరమాత్మనూ నేను ॥మ॥

చరణం 1 మర్రి వృక్షము వాలే విస్తరించెను మదిని
మమతాను బంధాలూ లోకేశా ఓ ఈశా
నిన్ను తెలియగలేక, నిన్ను చేరగలేక అల్లాడుతున్నాను
ఆదుకోరావయ్యా - ఆదుకోరావయ్యా॥మ॥

చరణం 2 కటిక చీకటిలోనా దారి కానగరాదు
మోహాల చీకటిలో నిన్ను కానగలేను
కడగంటి చూపైనా నాపైన ప్రసరించి ॥క॥
నిన్ను చేరు దారేదో చూప రావేలయ్యా
పరమాత్మ దేవా ॥మ॥

చరణం 3 వెనుక జన్మలలోనా ఏరూపునున్నామో
ఏజన్మ ఫలమో ఈ నరజన్మ నిచ్చావు
తత్వాలు చదివినా గురుబోధ విన్నా
సంసార బంధాలు విడలేక ఉన్నాను
ఏ రీతి నిను నే చేరుకోవాలో
ఎరుక పరచగ రారా ఏడుకొండలవాడా ॥మ॥

చరణం 4 కామక్రోధములు నను కబళించు చున్నాయి
కైమోడ్చి నిన్నునే శరణంటు వేడాను
పదదాసి బ్రోవరా రాజీవనేత్రా ॥మ॥

## పాట:108 (ఏమిటి నీ అవతారం వరుస)

పల్లవి ఏటికి ఈ మమకారం
ఎందకా ఈ మమకారం ॥ఏ॥

చరణం 1 ఆలు బిడ్డలూ నీ వారను కొని
మమతల పందిరి అల్లెదవేల
ఎక్కడ వరకూ తోడు వత్తురో ॥ఏ॥
ఎరుగవు నీవూ ఓ మానవుడా ॥ఏ॥

చరణం 2 వృద్ధాప్యమునా బాబూ అంటూ
తనయుని పిలువగ ఓ మానవుడా
ఛిపో అంటూ ఛిదరించును
ఈ సత్యమునూ ఎరుగుము నరుడా ॥ఏ॥

చరణం 3. మట్టి అంటకా మట్టి పురుగు
తిరుగును భూవిలో ఓ మానవుడా

సంసారమునా బందీకాకా

తిరుగుట ఎరుగుము ఓ మానవుడా ||ఏ||

చరణం 4 ఎన్ని జన్మములు పుణ్యామో ఇది

మానవ జన్మ ఓ మానవుడా

జన్మ విలువనూ తెలియగలేక ||జ||

నారాయణునీ మరచెదవేలా ||ఏ||

చరణం 5 మదిలో ఉన్నా నారాయణునీ

తెలియగ యోచన చేయర నరుడా

వీడక ఆ హరి తలచిన నాడు ||ఏ||

నిత్యానందము కలుగును నరుడా ||ఏ||

చరణం 6 ఎదుట వారినీ నిందించితివా

నీచ జన్మమే మరు జన్మమునా

ఈ సత్యమును తెలిసి మసలుకో ||ఈ||

అందరి తోటి ప్రేమ పంచుకో ||ఏ||

## పాట:109 (తాండవ మాడెను వరుస)

పల్లవి తాండవ మాడెను పరమ శివుడు

శంకరుడు శివశంకరుడు

జటాఝూటమున శశిని ధరించి

ఢమరుక నాదము ఢమఢమ మ్రోగగ ||తాం||

చరణం 1 ప్రమధ గణములు ప్రక్క నిలువగా

పార్వతి సరసన హిమశైలంబున ॥ప్ర॥

ధిమిం ధిమిం ధిమి ధిమి తధిమి అనుచు

పరవశంబునా - గౌరీహరుడు ॥తా॥

చరణం 2. నందీశ్వరుడు కావలుండగా

దశకంఠుడు శివనామము తలచుచు

కైలాసంబును భుజమునెత్తగా

రావణ గర్వము నణచుచు శివుడు ॥తా॥

చరణం 3 వృషభ వాహనుడు విశ్వంభరుడు

జ్యోతిర్లింగుడు లింగ స్వరూపుడు

భోళాశంకర భక్తవ శంకర

అవిరళముగ జగదాంబను గూడి ॥తా॥

చరణం 4 తాండవ కేళిలో మునిగి యుండగా

భువిలో భక్తుల మొరలే వినక

పిలచి పిలచి అలసిన రాధను

బ్రోవగ రాడే నీలకంఠుడు ॥తా॥

**పాట:110** (హృదయం మురిసెను వరుస)

పల్లవి మనసే మురిసెను మాధవ రూపం కనగానే

అ ప॥ ఈనాడు కనిపించె కన్నయ్య నాకనుల
తనువు పులకరించె గోవిందు కనగానే ॥మ॥

చరణం 1 మల్లెల మాలికల అస్వామి నర్చించి
మొల్లల జాజుల ఆపాదము పూజించి
ఆస్వామి చేరగ అర్థించినా గానీ
పలుకగ లేదే ఆస్వామి నాతోను ॥మ॥

చరణం 2 నీవైనా చెప్పవమ్మ ఓసత్యభామా
నీమాట జవదాటడే స్వామి ఏనాడు
ఒకసారి పలుకగా నేవేడినానని
వినిపించవమ్మా శ్రీ కృష్ణునీ రాణి ॥మ॥

చరణం 3 పారిజాత పుష్పము నీవడుగ
వృక్షమును పెకలించి నీముంగిట నిలిపెను
నాచిన్ని కోరికను నెరవేర్చ నీకెంత
నీ స్వామితో తెల్పు నాగోడు వినమనీ ॥మ॥

చరణం 4. ఈజగతి మాయలో అలసిన రాధను
శ్రీధరుని చేరగా ఎన్నాళ్ళు వేచేను
నీవైన చెప్పవమ్మ ఓరుక్మిణమ్మ
నీ భక్తికి మెచ్చి నీమాట వినునేమో ॥మ॥

**పాట:111**

పల్లవి ఎక్కడ ఉందీ అజ్ఞానం
నీలో ఉందీ అజ్ఞానం ॥ఎ॥

అ ప॥ కామ క్రోధములు దరి రానీకా
ఉప రతిగా నీవు మారే వంటే
పూర్ణ జ్ఞానిగా మారెద వీవూ ॥ఎ॥

చరణం 1 ఆలయాన నీవు చేరినగానీ
సప్తద్వారములు దాటినగానీ
ఆ హరినీ నీవు చూడగ లేవూ
ఆధారా స్వాధిష్టాన, మణిపుర
అనాహతా విశుద్ధ ఆజ్ఞ
సహస్రారములు దాటిన గానీ
పరబ్రహ్మమును చూడగలేవూ ॥ఎ॥

చరణం 2 ప్రాణాయామం చేయాలీ
చిత్ర చలన మరి కట్టాలీ
ధారణ ధ్యానా అష్టాంగాలు
సాధన చేసే
పురుషోత్తముడుగ నిలవాలీ ॥ఎ॥

చరణం 3 వెన్నకు నీరంటనట్లుగా
ఇహమున నీవు బందీకాక
మోహనరూప శ్రీహరి చూడగ
ధ్యాన సాధనములు చేయర నరుడా ॥ఎ॥

పాట 112

పల్లవి తల్లి ఒడిలో జననం
ధరణి ఒడిలో నిధనం ||త||
మధ్యన జరిగె ఈ నాటకం
సత్యమని నీవు నమ్మకు నరుడా ||త||

చరణం 1 కీలు కీలునకు అతుకెరా
అతుకుల బొంత యె ఈ దేహం
ఈ దేహముపై మమకారం నీకు
ఏలరా ఓ నరుడా ||త||

చరణం 2. జగతిలో ఏదీ వ్యర్థము కాదూ
వ్యర్థ పదార్థము ఈ దేహమురా
కాటికి నీవూ చేరిన నాడూ
బూడిదగానే మారును దేహం ||త||

చరణం 3. జనన మరణముల చక్రములోన
ఎన్ని జన్మములు తిరిగెద నీవు
అచ్యుత నామము మదిలో నిలిపి
ఇహ బంధాలను మరువర నరుడ ||త||

చరణం 4. శాంతి సుఖమూ పొందాలంటే
శ్రీహరి నామం ఒకటే దిక్కురా
నీవారెవరూ శాంతినివ్వరు
ఇది ఎరుగుమురా ఓమానవుడా ||త||

పాట:113 (మంగళ హారతి)

పల్లవి హారతి గైకొనుమా శ్రీరమణా హారతి గైకొనుమా

అ ప॥ హారతి గైకొను అలివేలు నాథా ॥హా॥

పచ్చల హారతి పద్మానాథా ॥హా॥

చరణం 1 వృష భాద్రివాసా ఓ వెంకటేశా

శేషాద్రివాసా - ఓ శ్రీనివాసా

మాసేవలందీ - దీవింపరావా

నీరాజనమిదీ - నీరజనేత్రా ॥హా॥

చరణం 2 నిరతము నిన్నే కొలచితిమయ్యా

కోనేటిరాయా - కొండలరాయా

గైకొనరావయ్యా - పగడాల హారతి ॥గై॥

కర్పూరహారతి - కాంతతో గైకొను ॥హా॥

చరణం 3 వేదాంత వేద్యా- అందాల రాయా

వినులెందు నిన్నేరా ॥వినిగమాంత సంచారా॥

పరుగున రావయ్యా నీరాజన విందే ॥హా॥

చరణం 4 నీ పద సేవా ముక్తికి త్రోవా

మోక్ష ప్రదాతా - మంగనాథ

పదదాసి పిలచేనూ పాలింపరావా

హారతి అందీ దీవింప రావయ్యా ॥హా॥

**పాట:114** **(చలమేల రా వరుస)**

పల్లవి చలమేలనమ్మా అలివేలు మంగమ్మా ॥చ॥

అ ప॥ చలమేల నీకూ శ్రీభుని రాణీ
కరుణ చూపవమ్మా మా పూజలందీ ॥చ॥

చరణం 2 నడిరేయి వేళ నీ స్వామి నిను చేర
నామొరను నీవు వినిపింపవమ్మ
మిమ్ము చేర నేనూ వేచియుంటి నమ్మా ॥మి॥
మీదరి చేర్చా కదలిరాగదమ్మ ॥చ॥

చరణం 3 వెండి కొండపైన వెలసి ఉన్న స్వామి
వేయీ నామాలా పూజలందు స్వామి
రామా కృష్ణా అంటూ వేడు కొంటినమ్మా ॥రా॥
ఏ రూపమైనా స్వామి ఒక్కడే కదా ॥చ॥

చరణం 4 తోమాల సేవా చేయలేను తల్లీ
కానులిచ్చి మిమ్ము మెప్పింపజాలా
నామదియే మీకు కానుకిచ్చినానూ
పదదాసి కావా కదలి రాగదమ్మా ॥చ॥

పాట:115

కరుణ కురిపింపవా ఓ శ్రీశా నా ఈశ
కళ్యాణ శ్రీశా .... ॥క॥

ఉ ప ఎన్నాళ్ళు వేచేనూ - నిను చేర నేనూ
ఏడుకొండలా వెంకటేశ్వరా ॥క॥

చరణం 1 ఇహలోక బంధాలు ఇనుప గొలుసులై
బంధించె నన్ను నిను చేరనీయక
ఏరీతి నిన్ను నే చేర గలనూ
ఎరుక పరచవ ఓ శ్రీనివాసా . ॥క॥

చరణం 2 సప్తగిరులపై సిరులతో వెలసి
భక్తులసేవలు అందుచుంటివి
నీదరి చేరగ నే వేచియుంటిరా
చేయూత నిచ్చి నీ చెంతచేర్చరా.. ॥క॥

చరణం 3 కాలము కదలేను మృత్యువు సన్నిధికి
నా కనులు వేచేనూ నీరూపు చూడంగ
కాలహరణమూ నీ కేలస్వామి
పాలింప రావయ్యా ఈ రాధ పిలచేను ॥క॥

## పాట:116 లాలిపాట

పల్లవి లాలీ లాలి లాలీ లాలీ మాతా లాలీ
మము గన్న తల్లీ రావా మంగా లాలీ ॥లా॥

చరణం 1 మంగాపురమున వెలసితివమ్మా
అలివేలు మంగమ్మ
మల్లెల పానుపు వేసామమ్మ
పవళించావమ్మా ॥లా॥

చరణం 2 పట్టూ పానుపు వేసామమ్మ పద్మాలాలీ
జోలా పాడి జొకొడుతానూ వైష్ణవి లాలీ
భక్తుల నెల్లా పాలించావూ అలసితివమ్మ
నీపాదములను పట్టెదమమ్మ నిదురాపోవమ్మ ॥లా॥

చరణం 3 జగములెల్ల తిరిగి కందెను నీ పాదములమ్మ
సేదతీరగ పదములు పట్టెద పవళింపవమ్మ
శ్రీనివాసుడు నీదరి చేరగ వేచి వుంటివా
రమాణుని గూడీ పవళించమ్మ జోలపాడెదనూ ॥లా॥



